నాట్య కళా ప్రపూర్ణ

# బళ్ళారి రాఘవ

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

ప్రథమ ముద్రణము
1200 ప్రతులు
జులై 1976

వెల
రు. 5-00

ప్రతులకు : జానమద్ది విజయభాస్కర్
1/508, గాంధీనగర్
కడప.

శ్రీ గజానన స్టోర్సు, రాయదుర్గం
శ్రీ శ్రీనివాస బుక్‌హౌస్
ట్రంక్ రోడ్
కడప.

ముద్రణ :
శ్రీ కైలాస్ ప్రింటింగ్ ప్రెస్
కడప.

కడపజిల్లా ప్రకాశం శతజయంత్యుత్సవ సమితి
సహాయ పథకం క్రింద ప్రచురితం



ఆంధ్రకేసరి

# కృతజ్ఞతాంజలి



ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయ మొనర్చిన
కళాహృదయులు, కడపజిల్లా కలెక్టర్

**శ్రీ పి. యల్. సంజీవరెడ్డి, I.A.S.**

# అంకితము

స్వాతంత్ర్యోద్యమంలో ప్రధాన పాత్రవహించి, ప్రజానాయకుడు, ఆంధ్రకేసరియైనవాడు

నాటకరంగములో ప్రధాన పాత్రవహించి, మృదు మధుర శ్రీమూర్తియైనవాడు

ఆ....పూర్ణ 'ప్రకాశం' లోని కాంతికిరణానికి యీ 'నాట్యకళాప్రపూర్ణ' అనుబంధంగా..........

# ధన్యవాదము



శ్రీ కె. దొడ్డనగౌడ

శ్రీ రాఘవ ఆప్త శిష్యులు, ప్రసిద్ధ రంగస్థల నటులు, నాటక కర్తలు, గమక కళాప్రవీణ, గమక కళానిధి బిరుదాంకితులు. ఈ పుస్తక ప్రచురణకు ప్రోత్సహించి రాఘవ చిత్రముల నందించిన సహృదయవతంసులు. వీరి కన్నడ "రాఘవ" నా రచనకు ఎంతగానో వుపకరించింది.

# నివేదన

కొన్నేళ్ళుగ అడుగున పడివుండిన యీరచనవెలుగుచూడటానికి కారకులైన సహృదయ మిత్రులు డాక్టర్. మల్లెమాల వేణుగోపాలరెడ్డి గారికి నా కృతజ్ఞతలు.

ఆత్మీయ భావముతో పుస్తకముద్రణలో అన్నివిధాలా సహకారాన్ని అందజేసిన మిత్రులు శ్రీ పి. రామకృష్ణారెడ్డి (తులసీకృష్ణ) గారికి నమస్సులు.

ఈ పుస్తకాన్ని పరిష్కరించి సూచనలిచ్చిన శ్రీ పేరాల భరత శర్మగారికి, నాకృషిని ప్రోత్సహించిన మిత్రులు సర్వశ్రీ యం.యస్. సిద్ధేశ్వరరావు (ప్రజాసంబంధశాఖ అసిస్టెంటు డైరెక్టర్); సి. అనంతరావు; యం. మోహనరావు (శ్రీనివాస బుక్‌హౌస్, కడప); జె.సి. సుబ్బయ్య, యస్. నారాయణ, యస్. రాజన్నకవి గార్లకు నా ధన్యవాదాలు.

అమూల్యాభిప్రాయాలందించిన శ్రీయుతులు కె. దొడ్డనగౌడ, ధర్మవరం వేణుగోపాలాచారి, పైడి లక్ష్మయ్య, పద్మశ్రీ డా॥ పుట్టపర్తి నారాయణాచార్య గార్లకు నా ప్రణతులు.

తమ 'బళ్ళారిరాఘవ' గ్రంథమునుండి రాఘవగారిఉపన్యాసాలను ప్రకటించుటకు అనుమతించిన శ్రీ కొత్త దేశపతిరావు గారికి నా అభివందనము.

ఈ పుస్తకాన్ని అందంగా దోషరహితంగా ముద్రించి యిచ్చిన శ్రీ కైలాస్ ప్రింటింగ్ ప్రెస్ యజమాని శ్రీ రామకృష్ణజోషి గారికి, ముఖచిత్రశిల్పి శ్రీ జి. వెంకటరాయులుగారికి నా కృతజ్ఞతలు.

– జానమద్ది హనుమచ్ఛాస్త్రి.

## రా ఘ వ

ఆవిశాల లోచనాలు
అనంతభావాల దర్పణాలు
ఆనాసిక
అతిలోక సౌందర్యాని కనుప్రవేశిక
ఆతనివంటి నటకుడు నాడులేడు
ఇకరాడు
ఆజ్యోతికి సర్వప్రపంచం నివాళులిచ్చింది
ఆ మరణానికి కాలమే నిట్టూర్చింది

— పుట్టపర్తి.

## ఆం ధ్ర కే స రి

దేశనాయక శిఖామణియై
తెలుగు జాతి ప్రకాశమ్మై
అవతరించిన ఆంధ్రకేసరి
అమరుడైన పురారి యాతడు.

— జానమద్ది.

# తొలిపలుకు

గమక కళాప్రవీణ, గమక కళానిధి

## కె. దొడ్డనగౌడ

జోళదరాసి.

నాట్యాచార్యుడై, నాట్యకళాప్రపూర్ణుడై విశ్వవిఖ్యాతిగన్న రాఘవగారి జీవిత చరిత్ర ఒకరు వ్రాసి ముగించేదికాదు. "విన్నంత కన్నంత తెలియవచ్చినంత" అని చెప్పిన పోతనగారి వాక్యం పెద్దవారి చరిత్రలు వ్రాయబోయే రచయితలకు స్మరణీయము.

భారతీయులకు చారిత్రక దృష్టి తక్కువ. చారిత్రక సత్యాలమీద గౌరవంకంటె వారికి ఆదర్శవాదం మీద అభిమానమెక్కువ. అందువల్ల ఏదో ఒక అవకాశం వుంచి ప్రతిభావంతులైన మహావ్యక్తులను దేవతలుగా చిత్రించుకుంటారు. పాశ్చాత్య సంపర్కం వల్ల చరిత్రను చరిత్రగా చూడాలన్నదృష్టి ఈ శతాబ్దంలో ఏర్పడింది. ఆ దృక్పథంతోనే తెలుగులో కొన్ని చారిత్రక జీవిత రచనలు వచ్చినాయి.

రాఘవాచార్యులు తమ చరిత్రను తామే రచించి యుండిన ఈనాటివారికి ఎంతో ఉపకరించి వుండేది. ఎందరో గొప్పవారు తమ గొప్పదనాన్ని తాము చెప్పుకోవటం ఆత్మప్రశంసగా అభిప్రాయ పడినందువనేమో, కొన్ని యథార్థమైన వారి వ్యక్తిగత విశేషాలు అలభ్యమై పోయాయి.

ఆచార్యుల కళాప్రతిభను, కలిసి నటించిన నటులుగాని, నాటక రచయితలుగాని శాశ్వత విలువలు కలిగిన రచనగా మనకందించలేదు. న్యాయవాదిగా (లాయర్‌గాకాదు) కూడా ఆయన విశిష్టతను సమకాలీన న్యాయవాదులు తాత్కాలికంగా గౌరవించినారేకాని దాన్ని పాఠంగా మనకు నేర్పాలనుకోలేదు. ఇది విచారకరమైనది.

ఈ విషాదం రాఘవ విషయంలోనేకాక మరెందరో మహావ్యక్తులపట్లకూడా అనుభవించవలసివచ్చింది. అట్టివారిలో ఆంధ్రనాటక పితామహుడైన ధర్మవరం రామకృష్ణమాచార్యులు; ఆంధ్రచారిత్రక నాటక పితామహుడు, మహావిద్వాంసులైన కోలాచలం శ్రీనివాసరావుగారు ముందుగా జ్ఞప్తికి వస్తారు.

అనారోగ్యంతో నేను బళ్ళారిలో నున్నపుడు రాఘవగారి జీవితచరిత్రను వ్రాయవలెనని, వారి అనుమతినిపొంది చెప్పినది వ్రాస్తూవచ్చినాను. అప్పటి వారి వృద్ధాప్యములో చాలాయేండ్ల క్రిందట విషయాలు సరిగా స్మృతికి తెచ్చుకొని చెప్పలేక పోయినారు. నా ప్రేరణవల్ల ఎంత స్మృతిపైకి తేలిందో అంతా వ్రాసినాను. అప్పటికి వారి సహచరులు కొందరున్నావారిని సంప్రదించి మరికొంత విషయసేకరణ చేయటానికి నాకవకాశం లేకపోయింది. అవకాశం వచ్చేలోపల రాఘవతోపాటు వారి సమకాలీనులు గతించినారు.

ఇప్పుడు నా మిత్రులు ఇదివరలో పత్రికలలోని విషయాలను, లేఖలను, ఇంకను జీవించియున్నవారి సహచరులనుండి కొన్ని విషయాలను సంగ్రహించి ప్రకటించినారు. కొత్త దేశపతిరావుగారు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సహాయంతో "బళ్ళారి రాఘవ"ను ప్రకటించినారు.

ప్రస్తుతం నా ప్రియ మిత్రులు జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారు ప్రభుత్వోద్యోగి అయినప్పటికి చిన్ననాటినుండి బళ్ళారి భాస్కరాచార్య రామచంద్రస్వామిగారి సాన్నిధ్య సేవా ఫలమువల్ల పండితులు, శాస్త్రజ్ఞులు, కళావిదులు ప్రతిభావంతులతో వినయ వినమ్ర విధేయతలో మెలగి, సాహిత్య కళయందు పురోభివృద్ధినిపొంది రచయితయై ప్రఖ్యాతిని వడసి మాసీమకు కీర్తిదాయకమై రాఘవ చరిత్రను విస్తరించి ప్రకటించుట నాకు మిక్కలి సంతోషమైనది.

సన్నిహిత స్నేహం గొప్పది. దీనిని గ్రహించి అప్పటినుండి ఇప్పటివరకు ఒకే రీతిగా వర్తిస్తూ, సాహిత్యసేవలో తనకెంత కష్టమైనా సహించి ఉత్సాహముతో బళ్ళారి ప్రాంతపు ప్రేమాదరముతో అప్పుచేసి పుస్తకాన్ని ప్రకటించు సాహసానికి ఆశ్చర్యపడినాను.

నాట్యకళా ప్రపూర్ణుని మనకు దక్కించడంకోసం నా మిత్రుడు చేసుకున్న ఋణ భారం దించవలసిన కృతజ్ఞతాభారం తెలుగువారిమీద ఉంది.

శాస్త్రిగారి రచనా వైఖరి విషయ ప్రతిపాదన నేను వివరించడంకన్న సహృదయులూ, విజ్ఞులైన పాఠకులు గుర్తిస్తే సంతోషించేవారిలో మొదటివాణ్ణి.

- కె. దొడ్డనగౌడ

13-6-76.

# అభిప్రాయములు

అనంతపురం,
24-6-76

'కవిచకోర చంద్రోదయ'

పైడి లక్ష్మయ్య, B.A.,B.L.,
మాజీ లోక సభసభ్యులు,
మాజీ హిందూదేవాదాయ కమీషనర్,
నాటక కర్తలు.

యుగపురుషులైన మహాత్మాగాంధీజీ, విశ్వకవి, గురుదేవులగు రవీంద్రునివంటి మహనీయుల వివాదలందుకొన్న నాట్యకళాప్రపూర్ణులు లోకవిఖ్యాతిగాంచి నాటకరంగమున నవీన పథమెక్కిన నటశేఖరులు బళ్ళారి రాఘవగారు.

నాచే రచింపబడిన "సాయిలీల" "సంసారనౌక" అను నాటకములను బళ్ళారి రాయల్ థియేటర్‌లో నాటి మద్రాసు గవర్నర్ "సర్ఆర్థర్‌హాప్" సమక్షమున ప్రదర్శింపబడినపుడు రాఘవగారు ఆ నాటకములను వీక్షించి, నా రచనా పాటవమున కానందించి నన్నుప్రోత్సహించిన ఉదారగుణ సంపన్నులు.

తమ సహజనటనాకౌశలముతో అంతర్జాతీయఖ్యాతిని గడించిన రాఘవ స్ఫురద్రూపి. ఉత్తమ నటన కావశ్యమగు కల్పనాశక్తి, జ్ఞాపకశక్తి, సమయస్ఫూర్తి, ఆరని నిత్యనూతనాభినయ ప్రదర్శనానురక్తి వారిసొత్తు, నాటకరంగములో నూత్నవిప్లవాలను తెచ్చినది మనదేశమున ఈధీరగుణు డొక్కడే. సంగీతానికి ప్రాధాన్యత తగ్గించి, భావానికి, అందుకు తగినఅభినయానికి ప్రాముఖ్యతనిచ్చిన నటకాగ్రేసరుడు శ్రీరాఘవ. యూరప్ ఖండమంతటా పర్యటించి పలునగరములలో భారతీయ నాటకకళాదర్శములను గురించి ఉపన్యసించిన నాటకకళాభిజ్ఞుడు, ఎందరోపాశ్చాత్య విమర్శకుల, నటులప్రశంసలందుకొన్న నటచక్రవర్తి. విదేశపర్యటనానంతరం మనదేశమునకు తిరిగివచ్చి స్త్రీపాత్రలను స్త్రీలే ధరింపవలెనని ఉద్ఘాటించి సాధ్యమైనంతవరకు దానినిఅమలులో పెట్టినవిప్లవమూర్తి రాఘవ.

ఒకమారు ఆంధ్రనాటక పితామహుని జన్మస్థలమైన ధర్మవరంలో, రాఘవగారి అధ్యక్షతన ఒకసభ జరిపితిమి. ''నేటిఆంధ్రనాటకరంగము'' అనే విషయముపై నాచే ఉపన్యాసమిప్పించిరి. నానాటకరచనాశైలి వారికి నచ్చినందున 'దానశూరకర్ణ' నాటకమును నన్నురచింపుమని ఆదేశించిరి. తరువాత ఒకటిరెండు లేఖలు వ్రాసిరి. కానీ, అంతలోనే ఆమహానటులు కన్నుమూసిరి. ఆనాటి ఆంధ్రనాటక స్వర్ణయుగము మరలమనకేనాడు ప్రాప్తించునో!

తెలుగులో ఆనటకావతంసుని సమగ్రజీవితచరిత్ర ఇంతవరకు వెలువడకుండుట శోచనీయము. ఇటీవల శ్రీకొత్త దేశపతిరావుగారు రచించినట్లు వింటిని. నేను సంగీతనాటక అకాడమీ సభ్యుడుగా నున్నప్పుడు నాటకకళా తపస్వియగు వీరిజీవితచరిత్ర వ్రాయ సంకల్పించితిని. కానికారణాంతరములచే నామనోవాంఛితము ఫలింపదయ్యె. ప్రస్తుతము మామిత్రులగు శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారు ఎంతయోశ్రమించి అన్నివిషయాలను సమగ్రముగా సేకరించి, తమ అనుభవాలను జోడించి, ఈజీవితచరిత్ర రచనకు పూను కొని, ఆబాలగోపాలమున కర్థమగునట్లు ముద్దులొలుకు తేటతెలుగు పదములచే గ్రంథము పూరించుట నాకెంతో ఆనందము గూర్చినది.

ఇదివరకే వీరు వాసిగాంచిన 'మా సీమ కవులచరిత్ర'ను రచించి, అజ్ఞాతమగు రాయలసీమ కవుల ప్రతిభా విశేషములను వెల్లడించిరి. ఆ రచనా విధానమున వీరు విషయ సేకరణలో ఎంతనిపుణులో విదితమగుచున్నది. శాస్త్రిగారు బళ్ళారివాసులగుటచేతను, రసోపాసకులగు రాఘవగారి అనుచరులగుటచేతనూ, వారిజీవితచరిత్ర రచనకెంతయూ తగినవారు. ఆంధ్రపాఠకలోకము వీరిరచనను ప్రోత్సహించి పోషింతురు గాక.

- పైడి లక్ష్మయ్య.

---

D. VENUGOPALACHARI, B.A., B.L.,
ADVOCATE,
MEMBER, GENERAL COUNCIL,
ANDHRA PRADESH SAHITYA AKADEMI.

BELLARY,
9—6—1976.

My dear Sastri,

I am sending my heartfelt good wishes for the success of your venture in your Biography of Bellary Raghava. I refused to call him as late Raghava. He is ever living and ever acting in the great roles he has acted before.

Of all the Biographies about Raghava, Yours, I am sure, will be warm, affectionate and with a human touch about that great actor. You had personal contact through your uncle late Ramachandra Sastri and I am sure your book will be a great success, more so among people living in Rayalaseema.

The Homage paid to Ballary Raghava by Doctor P. V. Rajamannar in his never-to-be-forgotton words is still ringing in my ears when he talked on the Radio sometime in the year 1973. I put down his words :-

> " Unquestionably, Raghava is the greatest actor that Andhra has produced. He was more than that. Guru Dev Rabindranath Tagore said that Raghava was the greatest living Indian actor of the Century. Raghava was even something more: he belonged to world-class. No less a person that Bernard Shaw, who certainly was never guilty of fulsome Praise Extolled Raghava in the following words: 'If Shakespeare wrote, you have acted; it is pity that you were born in India. If only you had been here, England would have made you as great as Shakespeare". It is only Poets with vision like you that can write his biography.

I close with these last words of Raghava uttered a few words before his death on the 16th of April 1946, Fullmoon Day at 11-00 p.m. with these words :

OM : Siva Siva. OM : Siva Siva. OM : Siva Siva

Then he was gathered into the Great silence.

He lived nobly and died divinely.

*Yours sincerely,*

Amen.

D. Venugopalachari.

Phone : 2446

డా॥ మల్లెమాల వేణుగోపాలరెడ్డి,
M. S.,

SRI LAKSHMI CLINIC
MADRAS ROAD.
CUDDAPAH

3-7-1976

ఒకమనీషి జీవితచరిత్రను మనోజ్ఞంగా చిత్రించాలంటే వాఙ్మయమైన చిత్రకళ కావాలి. వాస్తవాన్ని కళారేఖలతో సగుణంగారూపొందించే వంపులతోగిసి జీవచైతన్యాన్ని వ్యంజింపజేసే భంగిమనుదిద్దడం ఒక విచిత్రమైన విశిష్టమైన ప్రక్రియ.

ఒకనాయకుని చరిత్రను కథగా చెప్పుకొనిపోతే ఎన్నివేల పేజీలైనాచాలవు. వేగం ఎక్కువైన ఆధునిక జీవితంలో అల్పాక్షరాలతో అనల్పప్రభావంవేసే సంగ్రహ రచనలు కావాలి. వీరకీర్తనం, మనీషిప్రభావం వ్రాతలోవెలసి కావ్యగౌరవాన్ని ఆరచన సంతరించుకోవాలి.

పై చెప్పినగుణాలన్నీ శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారి "నాట్యకళా ప్రపూర్ణ రాఘవ"లో యిమిడాయి.

ఇలాంటి సంగ్రహ చరిత్రలలో చివరికి సమగ్రంగానే కన్పించేగారడీ చేయడంలో శ్రీ హనుమచ్ఛాస్త్రిగారు ప్రసిద్ధులు. "Brevity is the internal Beauty of an Artistic narration" అన్నసూక్తి మాశాస్త్రిగారు బాగా ఒంటపట్టించుకున్నారు.

శ్రీ శాస్త్రిగారు "మాసీమ కవులు" వ్రాసి, రాయలసీమలో మరుగుపడిన కవిరత్నాలను వెలికితీశారు. "నటరత్నాలు" కూడా శాస్త్రిగారి కలంద్వారా వెలుగులోకి వచ్చారు. ఆయన "రాయలసిమ కవయిత్రులు" వ్యాసాలద్వారా కవయిత్రులకు పేరంటం చేయించారు. ఇప్పుడు తెలుగునాటకరంగానికి పట్టిన ప్రాతసాంప్రదాయాల వాసనలు కడిగి సశాస్త్రీయంచేసిన బళ్ళారిరాఘవగారి కళాప్రపూర్ణత్వాన్ని శ్రీ హనుమచ్ఛాస్త్రిగారు వెలువరిస్తున్నారు.

శ్రీ రాఘవ న్యాయవాది, శాస్త్రజ్ఞుడు, నాట్యకళా ప్రపూర్ణుడు, మతసామరస్యాన్ని స్థాపించిన విజ్ఞుడు, శ్రీ హనుమచ్ఛాస్త్రి న్యాయశీలి, శాస్త్రవాది, రచనా కళాకౌశలుడు, హితసావ్వరస్యాన్ని చూపించిన ప్రజ్ఞుడు. ఆమనీషిచరిత్రవ్రాసి ఈమనీషిధన్యుడయ్యాడు.

- మల్లెమాల వేణుగోపాలరెడ్డి.

# నాట్యకళాప్రపూర్ణ రాఘవ

శైవవైష్ణవుల మధ్యగల మతవైషమ్యాలను తొలగించి సామరస్యమును స్థాపింప జన్మించిన కారణపురుషులు బళ్ళారి రాఘవాచార్యులుగారు.

రాఘవ తండ్రిగారు నరసింహాచార్యులుగారు. వారు వీర వైష్ణవులు. బళ్ళారి పురపాలక సంఘోన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా వుండేవారు. ఆయన సంస్కృతాంధ్రములలో పండిత ప్రకాండులు. అష్టావధానులు. "ఆంధ్రనాటక పితామహ" బిరుదాంకితులైన ధర్మవరం కృష్ణమాచార్యుల సోదరి శ్రీమతి శేషమ్మ వారి అర్థాంగి. వారిది అనుకూల దాంపత్యము. చాలాకాలమువారికి సంతానము కలుగలేదు.

బళ్ళారిలో గడిగి వీరభద్రప్ప యింటి ప్రక్కనే "బసప్ప" అనే అవధూత ఒకరుండిరి. ఆయన వీరశైవుడు. ఎందరో భక్తులు తమ మనోభీష్ట సిద్ధికై ఆయనను సేవించుచుండిరి. ఒకనాడు అవధూత స్వామి శేషమ్మగారినిచూచి "అమ్మా నీగర్భములో బసవేశ్వరుడవతరించును" అని అనుగ్రహించిరి. 2-8-1880 వ తేదీన రాఘవ జన్మించెను. అవధూతల ఆశీర్వచన ఫలముగా జన్మించిన బిడ్డకు "బసప్ప" అని పేరుపెట్టిరి. వైష్ణవ సంప్రదాయమున కనుగుణముగా "రాఘవ" అని పిలిచేవారు. ఆపేరే రూఢియై జగత్ప్రసిద్ధమైనది. రాఘవ తరువాత నరసింహాచార్యులగారికి యిరువురు పుత్రులు, ఒక పుత్రిక జన్మించిరి.

చిన్నతనంలో రాఘవ బొద్దుగా ముద్దుగా వుండేవాడు. ఎనిమిదవ యేట బళ్ళారి మునిసిపల్ హైస్కూల్‌లో ఆరవతరగతిలో చేరిన రాఘవ పదునాలుగవయేట మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థుడైనాడు. ఆయన మొదటినుండియు కథలంటే చెవికోసుకునేవాడు. పాటలు వ్రాయటం అతని ముచ్చట. అతడు కుశాగ్రబుద్ధి. ప్రతియేడూ ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యేవాడు. అతనికి పాలక వర్గమువారు శుల్కము మినహాయించిరి.

బళ్ళారి వార్డ్లాకళాశాలలో యఫ్.ఏ. పరీక్షలో వుత్తీర్ణుడై పట్ట పరీక్షకొరకు మద్రాసులోని క్రైస్తవ కళాశాలలో చేరెను. మద్రాసు వాతావరణము యువకుడైన రాఘవలో మార్పులు తెచ్చినది. నాటకములతోపాటు టెన్నిస్, క్రికెట్ క్రీడలుకూడ అతనినిఆకర్షించినవి. తన యిరువదవయేట పట్టభద్రుడై బళ్ళారి చేరెను. ఆరు నెలల కాలం బళ్ళారి మునిసిపల్ హైస్కూల్‌లో ఉపాధ్యాయుడుగా వుండి తరువాత రెండు మాసములపాటు ఇంజనీరింగ్ గుమాస్తాగా పనిచేసి మరల మద్రాసువెళ్ళి న్యాయ కళాశాలలో చదువసాగెను, ఒకవైపు నాటక రంగము మరొకవైపు క్రీడారంగము. వీటి ఆకర్షణలో అతడు "లా" పరీక్ష తప్పిపోయెను. తప్పిన పరీక్షకు మరల 1905లో ప్రైవేటుగా చదివి కృతార్థుడయ్యెను. పైతృకమగు కవితాశక్తి రాఘవునికి వెన్నతో పెట్టిన విద్యయైనది. తండ్రికి వ్రాయు జాబులు కవిత్వ ధోరణిలో వుండేవి. తండ్రికి తనయుని వైఖరి అంతగా రుచించలేదు. కొడుకు బాగా చదివి గొప్ప న్యాయవాది కావలెనని ఆయనకోరిక. అందుకు తగినట్లు ఆయన రాఘవ అభిరుచిని ఆంగ్ల వాఙ్మయమువైపు మరలించిరి.

రాఘవ అటునాటకాలలోనూ ఇటుక్రీడలలోనూపడి చెడిపోవునేమో అన్న భయముతో తల్లిదండ్రులు త్వరపడి వివాహము నిశ్చయించిరి. వధువు కృష్ణవేణమ్మ కర్నూలు న్యాయవాది లక్ష్మణాచారిగారి పుత్రిక.

లేత్రాయములోనే వివాహమైనది. ఆమెనందరూ "పెద్దమ్మగారు" అనేవారు. ఆమె అక్షరాలా పెద్దగుణములుగల యిల్లాలు. తన భర్త యొక్క కళాప్రతిభకు దోహదమిచ్చిన మహిళామణి. ఈమె సాహచర్యంతో రాఘవ జీవితము కొత్తమలుపు తిరిగింది. ఆ మహాతల్లి పూజాఫలమువల్ల రాఘవ కళామయ జీవితము మూడుపువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లినది.

1906 వ సంవత్సరములో రాఘవ న్యాయవాద వృత్తిని చేపట్టిరి. మేనమామ ధర్మవరం రామకృష్ణమాచార్యులవద్ద సహాయకులుగ పనిచేసి అనుభవము గడించిరి. తరువాత స్వయంగా న్యాయవాద వృత్తిని చేపట్టిరి. ఆయన ఏనాడూ తనయింటిముందు బోర్డు తగిలించలేదు. అంతమాత్రాన కక్షీదారులు రాకుండా పోయిందీలేదు. త్వరలోనే గొప్పన్యాయవాదిగా పేరుగాంచిరి. సోదరుడు శేషాచార్యులు యింటి వ్యవహారములు చూచుకునేవాడు. ఆయన గుణవంతుడు. ఉదారుడు. అన్నగారిపట్ల ప్రేమాభిమానములు గలవాడు. ఆయనకూడా న్యాయవాదియే.

1920 లో రాఘవకు పండిత తారానాథ్‌గారి పరిచయము కల్గింది తారానాథ్ ఆయుర్వేద వైద్యులు. వేదాంతకోవిదులు, స్పురద్రూపులు. ఆయన రాఘవకు శివపంచాక్షరీ మంత్రోపదేశము చేసిరి. శైవవైష్ణవముల మధ్య సామరస్యమును సాధించిన విశాలహృదయుడు రాఘవ. ఆయన సర్వ సమతాదృష్టి కలవాడు. ఈదృష్టి ఆయన జీవితమును పునీతం చేసింది.

రాఘవకు ఇద్దరాడబిడ్డలు. కొడుకులులేరన్న కొరత అతనికి ఏమాత్రముండేదికాదు. వధూవరుల నాశీర్వదించునపుడు "దేశోద్ధారక సుపుత్రీ ప్రాప్తిరస్తు" అని దీవించెడివారు.

# క ళా భి రు చి

బాల్యమాదిగ నాటకరంగము అతనిని బాగా ఆకర్షించినది. మద్రాసులో విద్యార్థిగ నున్నప్పుడు అచట ప్రదర్శింపబడెడి నాటకముల నన్నిటిని చూచెడివారు. మేనమామ రామకృష్ణమాచార్యులు గొప్ప నటులు, నాటక కర్తలు. చిన్నతనముననే వారి ప్రభావము రాఘవపై బడింది. మద్రాసులో చదువుతున్నప్పుడు ''బాంబే పార్సీ థియేట్రికల్ కంపెనీ'' వారు తమ నాటకములను ప్రదర్శించుచుండెడివారు. వారి నాటకములలో అభినయించు 'దాదాభాయికత్రి' అనే ప్రసిద్ధ పార్సీనటుని అభినయం ఆచార్యులవారి అంతరంగముపై చెరగని ముద్రవేసింది.

ఒకసారి బళ్ళారిలోని వార్డ్లా హైస్కూలులో 'నన్' దంపతుల ఆంగ్ల నాటకాభినయం అతన్ని అమితంగా ఆకర్షించింది. తద్వారా రాఘవకు ఆంగ్ల నాటకములలో అభినయించే అవకాశం లభించింది.

నటనపై అభిమానము అంకురించినదశలోనే రాఘవ "డాక్టర్ అండ్ అపాతికరీ" అనే ఆంగ్లనాటకములో రంగభూమిని ప్రవేశించిరి. రాఘవకు రంగప్రవేశమంటే భయముగా వుండేది. మిత్రుల ప్రోద్బలముతో బెదురుగ రంగస్థలమున ప్రవేశించేవాడు. ఆ బెదురు చాలాకాలమువరకు వుండేది. అదొక మనోవ్యాపారముమాత్రమే. కొన్ని క్షణములలోనే ఆయన నటనకుపక్రమించేవాడు. ఉత్తమనటునికి కావలసిన కల్పనాశక్తి, సమయస్ఫూర్తి అతని సహజ సంపదలు. ఆకర్షణీయమైన విగ్రహము, సుందరవదనారవిందము, విశాలమైన నుదురు, నువ్వు పువ్వులాంటి ముక్కు, తేజోవంతమైన కన్నులు, రాఘవ రంగస్థలముమీదకు రాగానే ప్రేక్షకులను ఆకట్టుకొనేవి. పాత్రకు తగిన వేషభూషణములుదాల్చి అందుకు తగిన అభినయ కౌశలముతో సంభాషణాచాతురి జోడుకలిపి నేవకుని పాత్రనుండి

స్త్రమాట్టుపాత్ర వరకు అత్యంత కళాత్మకంగా ఆయన అభినయించెడి వారు, ఐదారేళ్ళ కాలములోనే కన్నడ దేశములోని అగ్రనటులుగా పేరుగాంచిరి.

1902 లో చిత్తూరు జిల్లాబోర్డు హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగా సి. టి పార్థసారథి మొదలియార్‌గారు వుండేవారు. ప్రభుత్వ సహాయముతో ఆయన పాఠశాల ఆవరణములో నాటకశాలను నిర్మింపజేసిరి. పాఠశాలలలో నిర్మింపబడిన మొదటి నాటకశాల యిదేఅని చెప్పవచ్చును. అచట చదువుచున్న వట్టం శ్యామారావు, శ్రీనివాస రావు అను సోదరులు షేక్స్పియర్ నాటకములలో అభినయించేవారు. రాఘవ ప్రతిభను అదివరకేవారు వినియుండిరి. వారు తమ చదువును పూర్తి చేసికొని తాము గొప్పనటులమనే భావముతో బళ్ళారికి వచ్చిరి.

అప్పుడు రాఘవ బళ్ళారిలోని వడ్రబండ సమీపములోని యింటిలో కాపురముండేవారు. వట్టంసోదరులు రాఘవప్రక్క యింటిలోనే వుండేవారు. అప్పట్లో రాఘవ "యంగ్‌మెన్స్ లిటరరీ అసోసియేషన్" అనే నాటక సంఘములో సభ్యులు. వట్టం సోదరులు "స్టూడెంట్స్ ఎడ్యుకేషన్ సొసైటీ" అనే సంఘములో వుండేవారు. ఈ రెండు సంఘాలవారు ఆంగ్ల నాటక ప్రదర్శనము లిచ్చుచుండేవారు. పొరుగింటిలో వున్నప్పటికి వారికి పరస్పర పరిచయమేర్పడలేదు. సీర్కావి ధోవతి ధరించి తమయింటి అరుగుమీద కూర్చునుట రాఘవ అలవాటు. వట్టం శ్యామారావుగారికి ఎట్లయినా రాఘవతో పరిచయం చేసుకోవలెననే వుబలాటముండేది. కాని రాఘవతో మాట్లాడవలెనంటే భయపడేవారు. అరుగుముందు అటూ ఇటూ పచారుచేసిరి. రాఘవ అతనిని పలుకరించలేదు. రాఘవగారి ఈఔదాసీన్యము వారిని బాధించెను. చివరకొకనాడు శ్యామారావుగారు వినయముగా 'ఆచార్యులవారూ' అనే గౌరవార్థక సంబోధనతో నమస్కరించిరి. రాఘవ నవ్వుతూ

''అయ్యో ఆ గౌరవాలన్నీచాలు'' రా! యిక్కడ కూర్చో" అని ప్రక్కనే కూర్చోబెట్టుకున్నారు. నాటినుండి వారిమైత్రి పెంపొందింది. శ్యామారావుగారు రాఘవతోపాటు ఆంగ్లనాటకములలో స్త్రీ పాత్రను ధరించేవారు. రాఘవ మహారసికుడు. ఒక్కొక్కమారు జలతారు అంచుగల ధోవతి, చెవిలో రాళ్ళపోగులు, చేతికిబంగారు కడియములతో అలంకృతుడై స్నేహితుల ఇంటికి వెళ్ళిరావటం అతనికొక మోజు. రాత్రి నాటకములో ధరించు వేషము ఉదయమునుండే ప్రారంభమయ్యేది అనవచ్చు.

కొన్నిదినముల తరువాత రాఘవ ''షేక్స్‌పియర్ క్లబ్" ప్రారంభించెను. వట్టం శ్యామారావు, వట్టం శ్రీనివాసరావు, రాఘవ, ముగ్గురూ అందలి ప్రముఖులు. ఏనాటక ప్రదర్శనముజరిగినను రాఘవ అందులో నాయకుడుగా వుండేవారు. వట్టం సోదరులు బెంగుళూరులో విద్యాభ్యాసము సాగించుచున్నప్పుడు అచ్చట అమెచూర్ సంఘమును స్థాపింపచేసి రాఘవను ఆహ్వానించిరి. తెలుగు, కన్నడ నాటకములను ప్రదర్శించి ప్రేక్షకుల ప్రశంసలను పొందసాగిరి.

## అభినయ కౌశలము

సుమారు ఏడు దశాబ్దములనుండి బళ్ళారి నాటకకళా కేంద్రమై యుండినది. బళ్ళారిలో ఉద్యమాలన్నిటిలో నాటకోద్యమము ప్రధానమై నదిగా ఉండినది. 1884 లో మైసూరునుండివచ్చిన మహారాజాకంపెనీ, రంగాచారి కంపెనీ అను రెండు నాటకసమాజములు బళ్ళారిలో తమ ప్రదర్శనములిచ్చి ప్రజల మన్ననలను పొందినవి. ఈ ప్రదర్శనములు బళ్ళారిలోని సుప్తమైయుండిన నాటక కళను జాగృత మొనర్చినవి. ధర్మవరం కృష్ణమాచార్యుల సోదరులైన గోపాలాచార్యులుగారు ఒక కన్నడ నాటకమును రచించి మిత్రులసహకారంతో దానిని ప్రదర్శించిరి.

ఆ నాటకము అంతగా రక్తికట్టలేదు. కృష్ణమాచార్యులుగారు ఉత్తమ నాటకము రచించి ప్రదర్శింపవలెనన్న దీక్షతో మొట్టమొదటిసారిగా "బాణాసుర" అను కన్నడ నాటకమును రచించి ప్రదర్శించి మెప్పు పొందిరి. ఈ మెప్పుదలయే వారిని నాటక రచనకు పురికొల్పినది. తరువాత వారు ముప్పది ఒక్క నాటకములను రచించి "ఆంధ్రనాటక పితామహ" అను ప్రశస్తితో విఖ్యాతులైరి. కృష్ణమాచార్యులుగారు నాటకకర్త లేకాక ఉత్తమ నటులుకూడ. తమ నాటకములలో నాయక పాత్రధరించి ప్రేక్షకుల మన్ననలందుకొని పేరు ప్రఖ్యాతులు పొందిరి. కోలాచలం శ్రీనివాసరావుగారు గొప్ప పండితులు. "ఆంధ్రచారిత్రక నాటక పితామహ" బిరుదాంకితులు. రాఘవ శక్తిసామర్థ్యములను లెస్సగా గుర్తించినవారు. ఇరువదిఎనిమిది నాటకములను నాలుగు 'ప్రహసనములు రచించిరి. కోలాచలంవారు ఆంగ్లములో రచించిన ప్రపంచ నాటక చరిత్ర' సుప్రసిద్ధమైనది. ఆంధ్రీకృతాగస్త్య బాలభారతము, భగవద్గీతా విమర్శనోపన్యాసాలు (12) వేదవిమర్శనోపన్యాసాలు (15) ఇతర విమర్శనోపన్యాసాలు (9) రచించిరి. వీటిలో విజయనగరపతనము (రామరాజు) అత్యంత ప్రసిద్ధమైనది. ఈ నాటకమున రాఘవ పఠాన్ రుస్తుం పాత్ర చిరస్మరణీయము. హరిశ్చంద్ర, చాంద్‌బీబి, శిలాదిత్య మున్నగునవి కోలాచలం వారి ప్రసిద్ధ నాటకములు. కృష్ణమాచార్యుల వారి నాటకములలో సారంగధర, చిత్రనళీయము, పాదుకా పట్టాభిషేకము పేరుగాంచినవి. ధర్మవరంవారు తమ నాటకములలో నాయకపాత్రవహించి అభినయించుటవల్ల ఆ నాటకము సహజంగా జన ప్రియమైనది. కృష్ణమాచార్యులవారు "సరసవినోదిని" సంస్థాపకులు. కోలాచలంవారి నాటకసమాజమునకు "సుమనోరమ" సభ యనిపేరు. ఈరెండు నాటకసమాజములు తమనాటకములను ప్రదర్శించుచుండెడివి. అది బళ్ళారిచరిత్రలో స్వర్ణయుగము. యువనటులు అత్యుత్సాహముతో రెండు సమాజములలోనూ అభినయించుచుండెడివారు. బళ్ళారి కీర్తి

కేతనమును ఎగురవేసినవి ఆ సమాజములు. సుమనోరమసభలో ముఖ్యులు రాఘవ, కరణం సీతారామరావు, కర్నూలు రామారావు, కోదండరామయ్య మున్నగువారు. శ్రీయుతులు బాదనహట్టి శ్రీనివాస రావు, హొళగుంది రామారావు సరసవినోదిని సభలో ప్రముఖనటులు. ఈ రెండు సమాజములలోని నటులకు పరస్పరము ప్రేమాదరము లుండెడివి. ఈ సమాజములలోని నటులమధ్య అప్పుడప్పుడు వైమనస్యములు తలయెత్తుచున్నప్పటికీ పరస్పరం సహకరించుకొనే వారు. ఈ రెండు నాటక సమాజములు బళ్ళారిలోనేకాక మద్రాసు, బెంగుళూరు, హైద్రాబాదు, విజయవాడ మున్నగు పట్టణములలోకూడా ప్రదర్శనము లిచ్చుచుండేవి. సరసవినోదిని సభవారికి మాత్రం వారి నాటక ప్రదర్శనవల్ల మంచి లాభాలు వచ్చుచుండేవి. సుమనోరమ సభవారికి ఆదాయము అంతమాత్రంగానే వుండేది, కోలాచలం శ్రీనివాసరావుగారు స్వయంగా శ్రీమంతులు. వారి అన్నగారైన వెంకట్రావుగారు గొప్పన్యాయవాది. తమ్ముని కళాసేవకు ఆర్థికంగా తోడ్పడుచుండేవారు, అవి మరపురాని మంచిరోజులు. అన్న ఒక నాటక సమాజములోను, తమ్ముడు ఒక నాటక సమాజములోను, తండ్రీ కొడుకులు వేర్వేరు నాటక సంఘములలోను వున్నప్పటికీ వారిలో కుటుంబ కలహము లుండేవికావు. రాఘవ తనమేమగారైన కృష్ణమా చార్యుల సభలో చేరుటకు యిష్టపడలేదు. రాఘవ తండ్రిగారుమాత్రం సుమనోరమ సభవారి సలహా మండలిలో సభ్యులు. కోలాచలం శ్రీనివాసరావు రచించిన "సునందిని" అను తెలుగు నాటకంలో మొదటిసారిగ పాల్గొనిరి. అప్పటికి రాఘవ వయస్సు ఇరవై యేండ్ల లోపు. ఆ నాటకములో రాఘవ దెబ్బదేళ్ళ ముసలివాని పాత్రను అభినయించెడివారు. వేషభూషణ భాషణములలో తమ యౌవనమును మరగుపరచి వృద్ధాప్యము పుట్టిపడునట్లుగా అభినయించెడివారు. ఒకమారు రాయదుర్గంలో "సునందిని" నాటకమును ప్రదర్శించిరి.

నాటకము ముగిసిన మరుసటిరోజు రాయదుర్గమునుండి ఒక కక్షీదారు తనకేసును చేపట్టవలసినదిగ బళ్ళారికి రాఘవను అర్థించుటకు వచ్చెను.

రాఘవ:— "మీరెవరు? మీరువచ్చినపని ఏమి?"

అతడు:— "మాది రాయదుర్గం. ఒక వ్యాజ్యమును రాఘవాచార్యుల గారికి అప్పగించవలెనని వచ్చితిని. వారింట్లో వున్నారా?"

రాఘవ:— అయ్యా! నేనే రాఘవాచారిని"

అతడు: "పరిహాసమున కంటున్నారా?"

రాఘవ :— (విస్మితులై) అయ్యా! ఇదేమి వింతగా వుందే. నేనే రాఘవాచారిని. నాపేరుగల వకీళ్ళు మరెవ్వరూలేరు."

అతడు :— "కావచ్చును. కాని తాముమాత్రం రాఘవాచారిగారుకాదు."

రాఘవ :— "మీరు పొరబడుతున్నారు."

అతడు :— "పొరబాటేమీలేదు. వారినినేను చూడలేదనుకున్నారాఏమి?"

రాఘవ —చూచేవుంటే మీరు ఇట్లు మాట్లాడేవారుకారు.

అతడు : అదేమిసార్. ఇట్లంటారు. నిన్నటిరోజున " సునందిని " నాటకంలో బాగా చూచితిని.

రాఘవ :—ఎవరిని?

అతడు :—మరెవరినండీ; రాఘవాచార్యులగారినే.

రాఘవ :—సరే! వారెట్లుండిరి?

అతడు —ఎట్లుండేదేమండి. ఆయన చాలా ముసలివాడు. కపీసము అరవైయేళ్ళుండవచ్చును.

రాఘవ :—(నవ్వి) కాదు, కాదు. నాటకములో నేనే ముసలివానిపాత్ర ధరించితిని. మీరుపొరపడినారు.

ఈ రీతిగా ఆవచ్చిన కక్షీదారు, రాఘవమధ్య వాదము జరిగినది. అంతలోనే వారిమిత్రులొకరువచ్చి ఆ వచ్చిన కక్షీదారుకు నచ్చచెప్పే టప్పటికి తలప్రాణం తోకకు వచ్చింది. ఆచార్యులవారి సమయస్ఫూర్తి,

జ్ఞాపకశక్తి అద్భుతమైనవి. ఈ శక్తులు కోలాచలంవారి "భారత యుద్ధము" అను పౌరాణిక నాటక ప్రదర్శనంద్వారా బహిర్గత మైనవి. పౌరాణిక నాటకములంటే రాఘవకు అంతగా గిట్టేవికావు. కాని అనివార్య పరిస్థితులలో వారు పౌరాణిక నాటకములలోనే అభినయించవలసి వచ్చింది.

ఒకనాటిమాట— "భారతయుద్ధ" నాటకము ప్రదర్శింపబడుచున్నది. నాటకం ప్రారంభమై ప్రథమాంకము పూర్తయింది. తెరపడింది. అంతలోనే ధర్మరాజు పాత్రధారి కూతురు కలరా వ్యాధికి గురియైందన్న పిడుగువంటివార్త అందింది. ఆ నటుడు వెంటనే తన వేషభూషణాలను తీసివేసి యింటికి పరుగెత్తెను. రెండవ రంగమున ధర్మరాజు పాత్ర ధారణకు ఎవరూలేరు. నాటకం ముగించక తప్పని పరిస్థితి ఏర్పడింది. కోలాచలంవారు గత్యంతరములేక పౌరాణిక నాటకములలో అభినయించుట కిష్టపడని రాఘవను ధర్మరాజుపాత్ర ధరించవలసినదిగా అభ్యర్థించిరి. రాఘవ కాదనలేకపోయిరి. అప్పటికప్పుడే ధర్మరాజు పాత్రను అభినయించటం ఏరీతిగ సాధ్యం అన్న అనుమానం వారికి కలగలేదు. ప్రేక్షకులలో కూర్చున్న రాఘవ నేపథ్య మందిరములోనికి వెళ్ళి ధర్మరాజు పాత్రయొక్క సంభాషణలను, పద్యాలను చదివించు కుంటూ వేషధారణ పూర్తిచేసిరి. నాటకం జయప్రదంగాసాగిపోయింది. కోలాచలంవారు ఎంతో ఆనందించిరి. మరొకమారు 'రుక్మాంగద' నాటకంలోకూడ ఇట్టి సంఘటన జరిగింది. సమయోచితంగా సంభాషణలను సాగించగలనేర్పు గలవారు రాఘవ. కాని నాటకంలోని సంభాషణలను కంఠస్థంచేసిన ఇతర నటులకు అది సంకట పరిస్థితి. అందువలన సంభాషణలు అంతా తన సొంత మాటలలో చెప్పినా చివరి మాటలుమాత్రం ఇతరనటుల సంభాషణలకు అనుగుణంగా అందించే వారు. సమయస్ఫూర్తితో అపారధారణాశక్తితో రాఘవ ఎన్నోసార్లు నాటకములలో అద్భుతంగా నటించి ప్రేక్షకుల మన్ననలందుకున్నారు.

ధర్మవరం వారి సరసవినోదిని సభ, కోలాచంవారి సుమనోరమ సభలమధ్య పోటీవుండేది అన్నవిషయం లోకవిదితం.

ఒకసారి సరసవినోదిని సభవారు హైదరాబాదులో తమ నాటకములను ప్రదర్శించుచుండిరి. అదేమోకాని 'చిత్రనళీయ' నాటకములో వీరనాయకుని పాత్రధారణకై వెంటనే రావలసిందిగా రాఘవకు తంతివార్త పంపిరి. రాఘవ, సుమనోరమ సభవారు ఉభయులు ఆశ్చర్యచకితులైరి. రాఘవపట్ల వక్రదృష్టిగల సరసవినోదిని సభవారి పిలుపును తిరస్కరించలేదు. వీరనాయకునిపాత్ర పాఠమును ఒక్కసారి చదువుకొని రాఘవ రంగస్థలమును ప్రవేశించిరి. రాఘవ చేతిలో ఆపాత్ర వినూత్నంగా మారింది. సభవారు, ప్రేక్షకులు పొందిన ఆనందమునకు హద్దులేదు. ఆపాత్రను ఇదివరలో నటించిన నటుడు రంగస్థలముపై ఒకమూలనుంచి మరొకమూలకు దూకుతూ కుప్పిగంతులువేస్తూ రంగస్థలముపై ఆర్భాటంచేస్తూ రంగభూమిలోని జంబుఖానాపై దుమ్ములేపేవాడు. ఆచార్యులవారి వీరనాయకుడు అందుకు పూర్తిగా భిన్నమైనవాడు. కుప్పిగంతులు, కేకలు ఎన్నడూ ఎరుగనివాడు రాఘవ. ఆయన నటన అంతా హావభావాలలోనే వెల్లడి అయ్యేది. ఆయన రంగస్థల ప్రవేశమే అపూర్వమైనది. వీరనాయకుడు దస్యుల నాయకుడు. రంగస్థల ప్రవేశంతోనే అతడు నిలబడేశీవి, తమలపాకులకు సున్నంరాస్తూ తాంబూలం నమలుతూ కంటికొనలనుండి చూస్తూవుండే ఆ గాంభీర్యమును, ఆశీవిని, రాఘవ అత్యంత సహజంగా వెల్లడించేవాడు. అంతేకాదు. దమయంతిని కబళించబోతున్న మహా సర్పమును ముక్కలు చేయగా ఆమె తన కృతజ్ఞతను వెల్లడించునపుడు ఆమె సౌందర్యానికి ముగ్ధుడై ఆమెపై తనకుగల మోహమును ప్రదర్శించడంలోను, ఆమెను బలాత్కరించడములోను వీరనాయకుడిగా రాఘవ చూపిన నటన అత్యంత సహజంగా వుండేది. చివరకు దమయంతి క్రుద్ధురాలై శపించుటతో భస్మీభూతుడగునపుడుకూడా

గంభీరోదాత్తముగా ఆ పాత్రను పోషించేవాడు. ఈరీతిగా పాత్రకొక నూత్నతను కల్గింపజేసిన రాఘవ అభినయమును ప్రేక్షకులేకాదు సరస వినోదిని సభవారుకూడా అమితంగా ప్రశంసించేవారు.

1920 లో బళ్ళారిలోని షేక్స్పియర్ సంఘం ఆధ్వర్యమున "63 పాలంకోటై, లైట్ ఇన్‌ఫెంట్రీ" కెప్టెన్‌గా నుండిన మార్షల్ (ప్రముఖ ఆంగ్ల నటుడు) తో పాటు "ఒథెల్లో" నాటకంలో అభినయించి, రాఘవ ఆంగ్ల మహానటులకు ఏమాత్రము తీసిపోనివారని నిరూపించుకొన్నారు.

ఏమైనప్పటికి పెరటిచెట్టు మందు పనికిరాదన్న సామెత రాఘవపట్ల నిజమైనది. ఒకమారు కోలాచలంవారు రచించిన "చాంద్ బీబీ" నాటకప్రదర్శనం జరిగింది. నాటకంలో రాఘవ ప్రధానపాత్రధారి. కాని ఆ ప్రదర్శనమునకు వసూలైన మొత్తం కేవలం పదమూడున్నర రూపాయలు మాత్రమే. రాఘవ ఏమాత్రము నిరాశచెందక వున్నవారి ఎదుటనే నాటక మంతటిని ప్రదర్శించిరి. అట్టి వుత్సాహము, కళాభిరుచి అనితర సాధ్యము. పౌరాణిక నాటకాలపై ప్రజలకుండిన మోజును చారిత్రక నాటకములవైపు మళ్ళింప చేయవలెనని రాఘవ ఇష్టము. ఆదృష్టితోనే కోలాచలంవారిని ప్రోత్సహించి "చాంద్ బీబీ" నాటకమును రచింపజేసిరి. రాఘవ పట్టుదలగలవాడు. తమ కర్తవ్యమును విస్మరించలేదు. పద్మనాభ వెంకోబాచార్యులు రచించిన "శివాజీ" నాటకమును పలుమార్లు ప్రదర్శించిరి. రాఘవ అభినయమునకు కీర్తిప్రతిష్టలకు పతాకమనదగినది కోలాచలంవారి "విజయనగర పతనము". ఆ నాటకములో రాఘవ "పఠాన్ రుస్తుం" పాత్ర ధరించేవారు. ఆపాత్రాభినయములో బళ్ళారి రాఘవ దేశవిఖ్యాతులైనారు. పఠాన్‌పాత్రాభినయములో అతనికతడేసాటి అనిపించుకొన్నారు. ఈ పఠాన్‌రుస్తుం పాత్రాభినయం ఆంధ్రనాటక చరిత్రలోనే అద్వితీయమని కళాకారులు ప్రశంసావర్షమును కురిపించిరి.

ఆచార్యులవారి పఠాన్‌పాత్ర హిందూ ముస్లిం సఖ్యతకు భంగ కరమని భావించి నాటి మద్రాసు ప్రభుత్వము ఆనాటక ప్రదర్శనమును నిషేధించెను. కాని మైసూరురాష్ట్రములో ఇదేనాటకము ప్రదర్శించినపుడు హిందూ ముస్లిములందరూ ముక్తకంఠంతో శ్లాఘించిరి.

స్థానం నరసింహారావుగారు ఈ నాటకమును చూచినతరువాత ప్రకటించిన అభిప్రాయములు గమనింపదగినవి. "రంగస్థలముమీద రామరాజు చరిత్రకు సంబంధించిన ఒక బుఱ్ఱకథ నడుస్తున్నది. ఆది వినడానికి వచ్చినట్లుగా రాఘవాచార్యులు పఠాన్ వేషంలో కొందరితో పాటు ప్రవేశించి ఒకరాయిమీద కూర్చుని, ఆపాటనువింటూ రొట్టె తింటున్నాడు. ఆబుఱ్ఱకథ దాదాపు ఇరవై నిమిషాలు పట్టింది. అంతసేపు పఠాన్ రొట్టె తినటం తప్ప ఒక్కమాటైనా మాటాడలేదు.

ఆ చెప్పే కథలో రామరాజు అనే ఒకరాజు చేసిన చెడుపనులు పఠాన్‌కు ఇష్టంలేదు. ఆరొట్టెను నమలుతూ అందులోని కొంతభాగాన్ని ఓప్రక్కకు కసిగా వుమ్మేస్తూ అసహ్యము, ఆక్రోశము, ఆవేదన, క్రోధము, ప్రతీకారవాంఛ, విషాదము మొదలైన భావాలను ప్రదర్శించారు. ప్రేక్షకుల దృష్టులు పఠాన్‌మీద, అతని ప్రతి చిన్న కదలికమీద లగ్నమైపోయినవి. ఆకథ అయిపోయింది. పఠాన్‌లోనికి వెళ్ళబోతూ ఆ కథకులను ఒక్కసారి తీవ్రంగా చూశారు. చప్పున పరిసరాలను గమనించారు. తనకోపాన్నణచుకొని ప్రతీకారసూచకంగా కాలితో నేలమీదరాసి విసురుగా లోనికి వెళ్ళిపోయాడు. అంతే. మరి మాట్లాడనేలేదు. ప్రేక్షకుల కరతాళధ్వనులు మిన్నుముట్టినట్లయ్యాయి. ఆ తరువాత నాటకంలో ఆయన కన్పించినపుడల్లా అందరితోపాటు నేనూ ఆనందముగ్ధుణ్ణయ్యాను."

ఆచార్యుల రుస్తుంపాత్ర మద్రాసులో సంచలనం కలిగించేది, అచటి ప్రసిద్ధ నటులొకరు "ఆదేంగొప్ప! సులభంగా నటించవచ్చును"

అన్నారు. రాఘవ మద్రాసు వెళ్ళినప్పుడు ఆ నటుడు ఆచార్యులను కలుసుకొన్నప్పుడు "అయ్యా! మీ పఠాన్ అభినయమును చూపండి. మీవలె నేనుఅభినయించగలను" అన్నారు. అప్పుడు రాఘవ "అయ్యా! ఇదేం పరీక్షపెడుతున్నారా? మీరు అభినయించచాలరని నేనెప్పుడూ ఎవరితోనూ చెప్పలేదే!" అన్నారు. అందుకానటుడు "కాదుకాదు, పఠాన్ రుస్తుం పాత్రాభినయములో తమను మించినవారు లేరని. అపాత్రను మరేనటుడు అభినయించలేడని" అందరూ అనుకొంటున్నారు. ఆ ఉద్దేశ్యంతోనే మీ అభినయమును గమనింపవచ్చితిని" అన్నారు. తాను కూడ రాఘవవలె అభినయించగలను అన్నాడు. ఆచార్యులు నవ్వుతూ ఆనటుని కూర్చుండజేసి రుస్తుం పాత్రను అభినయింపసాగిరి. ఒకమారు కాక మరొకమారు అభినయించవలసినదిగా ఆనటుడు కోరెను. రాఘవ అతని కోరికమేరకు ఆరుసార్లు అభినయించిరి. ఆరుసార్లు ఆరురీతులుగా వుండినది వారి అభినయము. దానిని అనుకరించుటఎట్లు? ఆచార్యులవారి పఠాన్ మూసపోసిన మూర్తిగాదు, ఆ పఠాన్ చైతన్యమూర్తి. ఆ నటుడు రాఘవ అభినయ ప్రతిభకు ముగ్ధుడై క్షమాపణ చెప్పుకొన్నాడు.

రాఘవ కోరికపై కోలాచలంవారు "శిలాదిత్య" అను నాటకమును రచించిరి. పారశీకులు భారతదేశమున ప్రవేశించు ఘట్టమును తీసికొని రచించిన చారిత్రక నాటకమిది. మానవ స్వభావమందలి గుణదోష నిరూపణకు చక్కని యితివృత్తముగల నాటకము. పౌరాణిక నాటకములపట్ల అత్యంత అభిమానము కలవారికి రాఘవాచార్యుల అభిప్రాయములు అంతగా సమ్మతము కాలేదు. నాటక రచనలో పౌరాణికములు, చారిత్రకములు, సాంఘికములు ముఖ్యమైనవి. పౌరాణిక నాటకములు మానవ సమాజమునకు అంతగా వుపకరించు నటువంటివికావు, అయినప్పటికీ ఆ నాటకములపట్ల ప్రజలకుగల అభిరుచి మాత్రం అధికము అని చెప్పక తప్పదు.

ఆచార్యులవారు 25–12–33 న మద్రాసులో జరిగిన తృతీయ ఆంధ్ర నాటక కళాపరిషత్ సభాధ్యక్ష పీఠమునుండి ప్రకటించిన అభిప్రాయములివి. ''పౌరాణిక నాటకాల కాలము గతించినది. సుబ్రహ్మణ్యస్వామికి వివాహమైనదోలేదో మనకెందుకు? రుక్మిణీ సత్యభామల మధ్య వైమనస్యముల గొడవ మనకెందుకు? ఇకనైనను సమాజమును ప్రతిబింబింపజేసే సన్నివేశములను, సాంఘిక ప్రయోజనము కాంక్షించే యితివృత్తములను మనము నాటకవస్తువుగా స్వీకరించవలెను. పౌరాణిక కథావస్తువు నిరుపయోగము. మనస్సుకు ఆహ్లాదము కల్గినప్పటికీ పౌరాణిక నాటకములలోని అలౌకిక సన్నివేశములు ఆధునిక సమాజము వేసే ప్రశ్నలకు సమాధానములు చెప్పజాలవని అన్నారు.''

రాఘవ చారిత్రక నాటకములకు అమిత ప్రాధాన్యమిచ్చెడివారు. ఇదివరలో పేర్కొన్నరీతిగా ''శిలాదిత్య'' నాటకము ఒకమారు మద్రాసులో ప్రదర్శింపబడినది.. ప్రేక్షకులలో పిఠాపురం మహారాజా ఒకరు. ఆ నాటకములో ఆచార్యులవారు మంత్రి కుమారుడైన మదనుని పాత్రధరించిరి. పురుషత్వమును మరుగుపరచి స్త్రీత్వమును ప్రకటించు సన్నివేశమది. శిలాదిత్య రాజసోదరిని మదనుడు ప్రేమించి, స్త్రీ వేషధారియై రాణీవాసమున దాసిగా చేరెను. తుదకు మదనుడు విఫల మనోరథుడగును. ఈ సన్నివేశమున ఆచార్యులవారి స్త్రీ పాత్రాభినయము అత్యంత సహజంగా వుండినది. ఆచార్యులవారి సవ్యసాచిత్వమును పిఠాపురం రాజావారు మిక్కిలి కొనియాడుటయే కాక తమ భార్య కోసము తెప్పించిన విలువైన బంగారు పతకమును. రజత ఖడ్గమునకుజోడించి రాఘవకు బహూకరించిరి. రాజాగారి బహూకరణ వారి సమయస్ఫూర్తిని నిరూపించినది.

అసమాన నటునిగా రాఘవ ప్రశంసా పరంపరల నందుకున్నాడు. బళ్ళారిలో మాత్రం అతనిపై అభాండములు వేసేవారు. ''విద్వాన్

సర్వత్ర పూజ్యతే'' అను సూక్తికి బదులుగా ''విద్వాన్ అన్యత్ర పూజ్యతే'' అను సూక్తి నిజమేమో అనిపించేది. నిందలకు గురిగానివారు చాలా అరుదు. ప్రసిద్ధవ్యక్తులు నీలాపనిందలకు గురికాకతప్పదు. కాని వీటిని గణింపక ముందంజవేయుట ధీరుల లక్షణము. ఈ కోవకు చెందినవారు రాఘవ. ఈనాటికి బళ్ళారిలో ఆచార్యులవారికి అభినయ మంటే ఏమోతెలుసా? అని ప్రశ్నించేవారు కొందరున్నారు. ఒకసారి ఆప్రశ్నకు నేనే గురిఅయినాను అన్నారు గౌడగారు.

రాఘవతో పరిచయంగల గౌడగారికి ఇదేమాత్రము విస్మయము కల్గింపలేదు. ప్రశ్నించినవారికి బండవలమెంతో వారికి తెలుసు. వారి ప్రశ్నకు సమాధానంగా ''అయ్యా! మీప్రశ్న సముద్రములో నీరుందా?'' అన్నట్టుంది. ఆచార్యుల అభినయకౌశలమును పరీక్షించుటకుముందు అభినయములోని గుణదోషములను పరికించే అభినయ పరుసవేది వుండవలెకదా!'' అని ప్రశ్నించిరి. ఈప్రశ్న వారికి కొంత మనస్తాపము కలిగించినది. వారు కొంచెము మెత్తబడి ''అయ్యా! నే నడిగేదల్లా ఆచార్యులవారి అభినయము శాస్త్రీయమైనదా కాదా?'' అన్నారు. ఆచార్యులవారి అభినయమును కొంతవరకు ఒప్పుకొన్నట్లయి శాస్త్ర చర్చకుదిగింది. ఎట్లో నవ్వును ఆపుకొన్నారు. ఆ ప్రబుద్ధుడే ఇదివర కొకమారు అన్నమాటలు జ్ఞప్తికివచ్చినవి. నావలెనే అభినయించేవారు, పాడకలిగినవారు ఎవరున్నారు? అని ఒకసారి వీధిలోనే ప్రశ్నించిరి. నా తొందరలో ''అయ్యా! మీవలె మాత్రం ఎవరూ పాడలేరు'' అని అప్పటికి తప్పించుకున్నారు గౌడగారు. ఇప్పుడు వారిదృష్టి ఆచార్యుల వారివైపు మళ్ళింది. కాని వారిని వదిలించుకొనుటకై ''అయ్యా! మీ ప్రశ్నకు సమాధానము చెప్పుటకు మనస్కరించడంలేదు. పైపెచ్చు ఆ శాస్త్ర పరిచయమూ నాకులేదు. అయితే ఒక్కవిషయం మాత్రం చెప్పక తప్పదు. చేతిలో పరుసవేదినుంచుకొని బంగారమును పరీక్షించవలెను. అట్లుకాక రాతిని పట్టుకొని, పరీక్షించకండి. ఇట్టి వృథా

చర్చ పనిచేటుమాత్రమే" అన్నాను. అంతటితో వారు సరేఅని వెళ్ళిపోయిరి. ఇదిమన బళ్ళారివారి నిందారోపణపద్ధతి. అంతమాత్రమున బళ్లారిలో రాఘవను గౌరవించువారికేమాత్రము లోటులేదుఅన్నారుగౌడ.

ఇట్టి నిందారోపకుల ప్రలాపముల నెన్నింటినో వారి బల్లక్రింద నుండు చింపిరికాగితాలబుట్ట మ్రింగివేసింది. తనను నిందించిన వారిని ఏమాత్రము ఆచార్యులవారు పట్టించుకొనలేదు. ఆ నిందాపరులే ఆచార్యులవారి సహాయమును అపేక్షించినపుడు తమ శక్తికిమించి తోడ్పడుచుండిరి. వారి దొడ్డగుణము అట్టిది. వారెందరికో ఆర్థికంగా సహాయముచేసినవారు. అతి మృదువైనది వారిమనస్సు. తమ నాటకములో అభినయించే బీదనటులకు నెలనెలా పైకంపంపేవారు. న్యాయవాదిగా వారు రెండుచేతులా ఆర్జించేవారు. తనను విమర్శించిన వారినికూడ గౌరవించి సహాయముచేసే ఔదార్యము గలవాడాయన. వారి దానశీలత కుల, మత, భావాలకతీతమైనది. ఏడాదికొకమారు తమ యింట హరిజనులకు విందు ఏర్పాటు చేసేవారు. వారికి నూతన వస్త్రములను పంచెడివారు. హరిజన బాలబాలికలకై "మద్దుతార" పాఠశాలను స్థాపించిరి. హరిజనసేవలో వారు శ్రీవైష్ణవమును విస్మరించి సంఘసంస్కర్తలై నిర్భయముగ హరిజనోద్ధరణకు తోడ్పడిరి.

రాఘవ తమఅభిప్రాయములను నిర్మొహమాటముగా వెలిబుచ్చే వారు. ఒకమారు నాస్నేహితులొకరు ఒక నాటకమును రచించి దానిపై రాఘవ అభిప్రాయమును సంపాదింపదలచిరి. అతడు పలుమార్లు గౌడ గారిని ఈ విషయమున ఒత్తిడి చేయసాగెను. అంతకుముందే గౌడ ఆ నాటకమును చదివియుండిరి. దానిపై రాఘవగారికి ఎట్టి అభిప్రాయ ముండునది ఆయనకు తెలుసు. గాని మిత్రుని ఒత్తిడిని తట్టుకొనలేక ఒకరోజు ఉదయం తొమ్మిది గంటలకు రాఘవవద్దకు వెళ్ళిరి. రాఘవ తమ కక్షీదారులతో వ్యవహార పత్రములను పరిశీలించుచుండే

సమయమది. గౌడను, నాటకకర్తను చూచి వచ్చినకారణ మడిగిరి. గౌడ ఆ మిత్రుని పరిచయముచేస్తూ అతడొక నాటకము వ్రాసినాడని, దానిపై వారు అభిప్రాయమును కోరివచ్చినారని తెలిపిరి. అంతలోనే నాటకకర్త వ్రాతప్రతిని రాఘవగారికి ఇచ్చిరి. అందుకు రాఘవ అయ్యా! తమ నాటకానికి నా అభిప్రాయము అనవసరము. ఈ విషయములో నేను చెడ్డవాణ్ణి. ఉన్నదున్నట్లు చెప్పుట నాస్వభావము. అందుకు గౌడగారి మిత్రులు "అయ్యా! మీరు నా నాటకమునుచదివి తమ అభిప్రాయమును ఇవ్వవలెను. అన్యథా భావించవద్దు" అన్నారు. మరునటిరోజు సాయంత్రం రమ్మని చెప్పిపంపిరి. అట్లేవెళ్ళిరి. రాఘవ మిత్రులతో ఛలోక్తులాడుచుండిరి. మమ్ముమ్మలనుచూచి కూర్చొమ్మన్నారు. ఉన్నట్లుండి నా మిత్రునిచూచి "అయ్యా; ఇదో మీ నాటకం. ఇట్టి నాటకంపై అభిప్రాయం వ్రాసేయోగ్యత నాకులేదు. అయితే నాకు తెలిసినంతవరకు చెప్పగలను. అసలు యిది నాటకమే కాదు. బడిపిల్లలు వినోద కాలక్షేపానికై ప్రదర్శించుటకు తగినది అంతే. దీనిని నాటకమని అనటం నాకేమాత్రం ఇష్టంలేదు. ఇదిగో మీ పుస్తకం" అని ఇచ్చివేసిరి. నాటకకర్త పేలమొహంవేసెను, అది గమనించిన రాఘవ వినయంతో "మీరేమీ బాధపడవద్దు. పాత్రల సంభాషణలతోనే అది నాటకమనిపించుకోదు. నాటకమునకెన్నో నియమములున్నవి. ఆ నియమములు లేనపుడు అదొక బీడి – చుట్ట వగైరాల ప్రచార పత్రిక. మిమ్ముమ్మలను, ప్రజలను మోసగించక స్పష్టమైన అభిప్రాయం వెలిబుచ్చుట నా ధర్మము. అట్లు కానపుడు కళకు అపచారము చేసిన దోషమునకు బాధ్యుడనగుదును. క్షమించండి" అని నమస్కరించి పంపిరి. నా మిత్రుడు బిక్కమొహంవేసుకొని ఒక దండంపెట్టి బయలుదేరెను. నేనూ అతనిని వెంబడించితిని. ఈ నిర్మొహమాటమువల్లనే తమ మేనమామ కృష్ణమాచార్యులగారితో ఒకమారు పేచీవచ్చింది.

కృష్ణమాచార్యుల భవనమునకు కొద్దిదూరంలోనే ఆచార్యులవారి బంగళా. ఒకసాయంకాలము కృష్ణమాచార్యులవారు తమ యింటి నుండి బయలుదేరి రాఘవ యింటిమీదుగా వెళ్ళుచున్నప్పుడు అకస్మాత్తుగా రాఘవను కలుసుకొన్నారు. అపుడు రాఘవ తన మేనమామ గారిని క్రిందివిధముగా ప్రశ్నించెను.

రాఘవ :—మామా! మీ ప్రహ్లాద నాటకము ఎందుకట్లావుంది?

కృష్ణమాచార్యులు:—ఏం? ఏమైంది?

రాఘవ :—అయ్యేదేముందిమామా! ఆ నాటకంలో ఉన్నదొకేఒకప్లాట్. కమ్మగా పాడేబాలునికి ప్రహ్లాదపాత్రనిచ్చి ప్రతిమాట తరువాత ఒక పాటను పాడించి, ప్రేక్షకుల తలలూపినంత మాత్రాన- పరవశింప జేసినంతమాత్రాన - నాటకం బాగుంటుందంటారా? ఇదేకాదు మీ ''సారంగధర''కూడ బాగాలేదు.

రాఘవగారి ఈ స్పష్టాభిప్రాయం కృష్ణమాచార్యులవారిని క్రుద్ధుని చేసింది.

కృష్ణ :—పో,పో, జోగి. అని అల్లుని గద్దించి ముందుకు సాగిపోయిరి.

కృష్ణమాచార్యులవారికి కోపము వచ్చినపుడు ''జోగి''అనేవారు. వారికోపానికి గురియైన మన ''జోగి'' ఎవరినీ లక్ష్యపెట్టేవాడుకాదు. అసలు యోగి ఎవరు ఏమన్నా పట్టించుకోడు. కోలాచలంవారి వద్దకూడ రాఘవ నిష్కర్షగా వ్యవహరించేవారు. కోలాచలంవారి ''సుఖమంజరి'', ''భారతయుద్ధం'' నాటకాలలో అభినయించనని చెప్పియుండిరి.

కళకుగల విలువలకు అత్యధిక ప్రాధాన్యమిచ్చేవారు రాఘవ. కాని తాను గొప్పనటుడన్న గర్వము వారికేమాత్రములేదు. ఆయన వినయమూర్తి. ఆర్ద్రహృదయుడు. సంపద, ప్రతిష్ఠ, పాండిత్యము అన్నీ అతనికున్నవి. అహంకార మేమాత్రము లేనివాడాయన. బిరుదులకు బహుమానాలకు బహుదూరంగా వుండేవారు.

ఒకసారి హైదరాబాదులో సరసవినోదిని సభవారు నాటక ప్రదర్శనలిచ్చిరి. నగల ప్రముఖులొకరు రాఘవ అభినయమునకు ముగ్ధులై ప్రదర్శనానంతరము స్వర్ణపతకమును బహూకరింపరాగా రాఘవ నిరాకరించిరి. ఆ కళాభిమాని తెచ్చిన స్వర్ణపతకము నిష్ప్రయోజనమైనందుకు చింతించి మరుసటిరోజు రాఘవను తమ యింట విందుకై ఆహ్వానించి పతకాన్ని స్వీకరించవలసినదిగా ప్రాధేయపడెను. రాఘవ విధిలేక స్వీకరించిరి. వారికెన్నో పతకములు ఇవ్వబడినవి. కాని రాఘవ వాటిని ఎప్పుడూ ధరించినవారుకారు. బిరుదులు, స్వర్ణపతకములు కళాభివృద్ధికి రాహుకేతువులవంటివని రాఘవ అభిప్రాయము. 1930 నవంబరు 29వనాటి ఆంధ్ర నాట్యకళాపరిషత్ అధ్యక్ష స్థానమునుండి వారుచేసిన వుపన్యాసములోని క్రింది అంశములు గమనింపదగినవి:—

"తమ బిరుదముతోను, పతకములతోను పత్రికలలో ప్రకటింప బడవలెనన్న ఆశ నేడు నటులలో అమితంగా పెరుగుతున్నది. ఇట్టి నటసింహులనందరినీ చేర్చినచో ఆ సింహాలు ఆఫ్రికాలోని సహారా నంతటిని ఆవరించగలవు" అని నేటి నటుల ప్రవర్తనను తీవ్రముగా ఖండించిరి. ఆంధ్రదేశములో యిట్టి చౌకబారు మనస్తత్వము వలననే కళకు అపచారము కలుగుచున్నదని అన్నారు.

ఆశ – నిరాశల మధ్య చిక్కుకొన్న మానవుడు ఎప్పుడో ఒక మారు స్వార్థమునకు బలియగుట నిశ్చయము. రాఘవ నిష్కామి. కళాసేవకుడు. అహంకారమున కేమాత్రము తావివ్వకూడదని వాదించేవారు.

రాఘవ సరళజీవి. తమ తప్పును నిర్భయంగా ఒప్పుకునే విశాల హృదయుడాయన. తోటి నటులెవరైనా అహంభావముతో వ్యవహరించి

నట్లయిన "అయ్యా! అహంకారము నీ అభివృద్ధికి గొడ్డలిపెట్టు. మొదట దానిని విస్మరించుము" అని ఆదరముతో విన్నవించేవారు. "అహంకారమనునది ఒక అంటువ్యాధి. ఆ వ్యాధిగ్రస్తుడైన నటుడు రంగభూమిని ప్రవేశించుటకు అనర్హుడు" అని వారెన్నోమార్లు ఉద్ఘాటించిరి. రాఘవ తమకు తెలియని విషయమును నిర్మొహమాటంగా తెలియదని చెప్పేవారు. నిరంతరము విద్యార్థివలె క్రొత్త విషయములను గ్రహించేవారు.

రాఘవ సరళమూర్తులు. తమకు ఆచార్యత్వం వద్దని తనను "రాఘవ" అని పిలిస్తే చాలని విన్నవించుకొన్నారు.

## రాఘవ - పౌరాణిక నాటకాలు
## హరిశ్చంద్ర పాత్ర

పౌరాణిక నాటకాలంటే గిట్టని రాఘవ కొద్దికాలం తరువాత కోలాచలంవారిచే రచింపబడిన హరిశ్చంద్రనాటకంలో హరిశ్చంద్ర పాత్రనభియించిరి. ఆచార్యులవారు ఆ నాటకములో అభినయించడం అందరికీ విస్మయం కలిగించింది. పౌరాణిక నాటకాలను తిరస్కరించిన రాఘవ వాటిని పురస్కరించడం పెక్కు వింతవ్యాఖ్యలకు గురిఅయింది. ఒకరోజు గొడ వారిని మామూలుగానే కలుసుకొన్నారు. రాఘవ మిత్రులతో ఏదోగోష్ఠి సాగిస్తున్నారు. గొడను దగ్గర కూర్చుండ జేసుకొన్నారు. విశేషాలేమని ప్రశ్నించినారు.

గొడ!—మిమ్ములను ఒక విషయం అడుగదలచి వచ్చితిని.

రాఘవ — అడగండి.

గొడ —మీరు మొదటినుండి పౌరాణిక నాటకాలను తిరస్కరించేవారు. ఇప్పుడు మీరు హరిశ్చంద్ర నాటకంలో అభినయించటంతో నాటక ప్రపంచంలో ఒక పెద్ద దుమారం బయలుదేరింది. అందుకు మీ సమాధానమేమి?

రాఘవ:— మీ ప్రశ్న సబబైనదే. కాని హరిశ్చంద్ర నాటకములో పాల్గొనుటలో నావుద్దేశము వేరుగా వుంది. హరిశ్చంద్రుని సత్యప్రకటనకై నేను ఆపాత్రను ధరించలేదు. ఆ సత్యాన్ని బహిర్గతంచేసే చంద్రమతియొక్క ధైర్య స్థయిర్యాలను, త్యాగ శీలము, సామాజికులపై చెఱగని ప్రభావము కలిగించుటకు ఆ పాత్రధారణ చేసితిని.

గౌడ :— అట్లయిన ఆ నాటకము........

రాఘవ·— గౌడా! కొంచెము ఆగండి. నేను చెప్పునది సాంతంగా వినండి. నా హరిశ్చంద్రుడు పిరికిపందకాడు. భారత వీరనారి యగు చంద్రమతిచే ప్రేరేపితుడై నిర్భయంగా సత్యాన్ని నిరూపించగలవాడు. ఆ వుద్దేశంతోనే కోలాచలంవారు నాటకం రచించిరి. వారు నావుద్దేశాలతో పూర్తిగా ఏకీభవించి వ్రాయటం వల్ల నేను అభినయిస్తున్నాను.

గౌడ:— "అయ్యా! ఆ కాలపు హరిశ్చంద్రుని సత్యశీలము ఈ నాడు చలామణి అవుతుందా? అన్నదేనాప్రశ్న. దీనితో సంఘానికయ్యే ప్రయోజనం ఏమీ వుండదు.

రాఘవ·— నేను ఆ సత్యముయొక్క ప్రయోజనమును గూర్చి చెప్పుటలేదు. మనలో స్త్రీలను హీనముగా చూచేవారెందరో వున్నారు. వారిలోని హేయభావాన్ని తుడిచివేయుటలో చంద్రమతి పాత్ర మిక్కిలిగ ఉపయోగిస్తుంది. చంద్రమతి ఆదర్శసతి. ఆమెయేలేకున్న సత్యహరిశ్చంద్రుడెక్కడుండేవాడు? ఒకవేళఉన్నప్పటికీ ఆతడుకేవలం హరిశ్చంద్రుడుగా వుండేవాడు. "సత్య" అనే బిరుదము చంద్రమతివల్లనే అతనికి లభించినది. అట్టి చంద్రమతి పాత్ర నేటి సంఘంలోని స్త్రీ దాస్యవిముక్తికి

ఉపకరించదా! ఏ సంఘ పురోగతికైనా స్త్రీల సహకార మత్యవసరము. అనాడే సమాజము సువ్యవస్థితంకాగలదు.

గౌడ :— అయ్యా అట్టి సన్నివేశాలు ఒక్క హరిశ్చంద్రలోనేకాక మరెన్నో పౌరాణిక నాటకాలలోను ఉన్నవి. అట్లయిన పౌరాణిక నాటకాలలో పాల్గొనుటకు మీకెట్టి ఆక్షేపణ వుండదనుకుంటాను.

రాఘవ:—అదికాదు. పాతకాలపు సమాజాన్ని నిరూపించే నాటకాలపట్ల నా ఆక్షేపణ వుండనేవున్నది. నాటి పౌరాణిక నాటకాలలో నేటి సామాజిక చిత్రములను కల్పించి ప్రదర్శించేపట్ల నాకెట్టి ఆక్షేపణ లేదు.

గౌడ:— అయిన మీవెనుకటి అభిప్రాయంలో మార్పువచ్చినదని భావించవచ్చునుకదా!

రాఘవ·—అట్లు భావించుటలో తప్పులేదు. ఒకమారు ఆంధ్రనాటక కళాపరిషత్ సభలో (25-12-33) పురాణ పురుషుడైన శ్రీరామచంద్రుడు తన భార్యను అపహరించిన రావణుని హతమార్చినాడని భావించడంకంటె తనదేశప్రజల క్షేమాన్నుద్దేశించి పరిపాలనా సౌష్ఠవము పెంపొందించిన విషయాన్ని గ్రహించడంలోనే మనకెక్కువ ప్రయోజన ముందని తెలియ జేసితిని. ఆ అభిప్రాయ ప్రకటనకు క్రియా రూపకంగానేను హరిశ్చంద్ర నాటకంలో పాత్ర ధరించితిని. పురాణ పాత్రల మూలంగా ఆధునిక భావాలను ప్రదర్శింప సాధ్యమగునని తెలుసుకొంటిని. పౌరాణికములలో నిరుపయోగకరమైనవెన్నో గలవు. అట్టి నాటకములను ఆధునిక కాళిదాసు రచించినను అవి పనికిరావు. కోలాచలంవారి కొన్ని పౌరాణిక నాటకాలలో నేను పాల్గొనను అని రాఘవ విపులంగా వివరించేసరికి గౌడగారికి సమాధానం లభించింది. ప్రాచీనతలో నవ్యతను ప్రతిపాదించి ప్రదర్శించడం రాఘవ అభిమతం.

# దు ర్యో ధ న

కోలాచలంవారు "ద్రౌపదీమానసంరక్షణము" అను నాటకమును రచించిరి. రాఘవ ఈ నాటకములో దుర్యోధనపాత్ర నభినయించేవారు. అర్జున పాత్రకంటె దుర్యోధన పాత్ర విశిష్ఠమైనదని నిరూపించుటయే ఆచార్యులవారి ఉద్దేశము. కొంతమంది పాండవ పక్షపాతులకు విడ్డూరంగా తోచినను రాఘవాచార్యుల ఉద్దేశ దోషం కాదు. వారిఉద్దేశము అర్థవంతమైనది. రాఘవ యొక్క దుర్యోధనుడు కేవలం దురహంకారికాడు. అంతరదృష్టికి గోచరమయ్యే ధీరోద్ధతుడు. నటుడు పాత్ర నభినయించుటలో ఆనటునియొక్క బాహ్యాంతర దృష్టులను చక్కగా అవగతం చేసికొని అభినయింపవలెనని ఆయన అభిప్రాయము. భారత కథానాయకులలో కీర్తి శిఖరాన్నధిరోహించిన పార్థునికంటె దుర్యోధనుడే గొప్ప అని రాఘవ అభిప్రాయము. మహాభారతములో ఇందుకెన్నో నిదర్శనములున్నవి. కన్నడ కవిపుంగవుడగు కుమారవ్యాసుని భారతములోని ఉద్యోగ పర్వమున శ్రీ కృష్ణుడు రాయబారిగా కౌరవులను చేరినపుడు దుర్యోధనుడు కృష్ణుని హిత వచనములను పెడచెవినిబెట్టి బంధింపనుంకించును. అప్పుడు కృష్ణుడు దుర్యోధనునికితప్ప తక్కిన వారందరికిని తన విశ్వరూపమును వెల్లడించును. ధృతరాష్ట్రునికి దృష్టిని ప్రసాదించెను. ఆనంత పారవశ్యమున ధృతరాష్ట్రుడు విశ్వ పురుషుని పొగడుచుండగ దుర్యోధనుడు భీష్మునిజూచి తాతా! ఈ ముకుందుని మాయలకులొంగవద్దు. సంధి ఈతని కభిమతంకాదు. కృష్ణుని మనోభిప్రాయం నాకు తెలుసు" అని కృష్ణుని మనోగర్భితాభిప్రాయములను వెల్లడించును. "కృష్ణుడు తలపెట్టిన భూభారహరణమున తాను ప్రధానపాత్ర వహించవలసియుండును "అన్నాడు. దుర్యోధనుడు "రణమహోత్సవములో నాశక్తికొలది పోరాడెదను. కృష్ణుని కదపనిదే

నాకు కైవల్యమెక్కడిది?" అని తన నిశ్చితాభిప్రాయమును వెల్లడించెను. దుర్యోధనుడు దుష్టాత్ముడన్న భావము పైపలుకులతో పటాపంచలగును.

కన్నడ మహాకవియగు "రన్నకవి" తన "గదాయుద్ధము" లో దుర్యోధన పాత్రను అత్యంత సహజంగా చిత్రించినాడు. బంధుమిత్రులనేకులు నిహతులుకాగా ఒంటరిగ గదాధారియై రణభూమిలో సంచరిస్తున్నాడు. తనమిత్రులు, సహోదరులు మున్నగువారి శవములను వీక్షిస్తూ శత్రుపక్షమువాడైన అభిమన్యుకుమారుని భౌతిక కాయాన్ని చూస్తాడు. ఆ వీరయువకుని రణపాండిత్యమును, సుగుణములను ప్రశంసిస్తూ "నీవంటి వీరమరణము నాకు ప్రాప్తించుగాక!" అనుకొంటాడు. శత్రువులలోని సుగుణములను ప్రశంసింపగల దుర్యోధనుని ఔదార్యము ఇచట ప్రస్ఫుటమగుచున్నది.

మృత్యువన్న ఏమాత్రము భయము లేనివాడు దుర్యోధనుడు. సర్వనాశనమైనదన్న దుఃఖమతనికేమాత్రములేదు. శరతల్పగతుడైన భీష్మునిచూచి నమస్కరించెను. భీష్ముడు దుర్యోధనుని దైన్యావస్థను చూచి విచారించును. ఇప్పటికైనను సంధిచేసుకొమ్మని హితవు చెప్పును. దుర్యోధనుడు అదెన్నటికీ పొసగదని పలుకును. కౌరవేంద్రుడు రావణేంద్రునివలె జీవితాంతమువరకు వైరమునే సాగించును. ఐహిక సుఖాపేక్షకంటె నిష్పాండవత్వముపట్ల దుర్యోధనుడు ఆసక్తుడై యుండినట్లు స్పష్టమగుచున్నది.

ప్రసిద్ధ భారత విమర్శకులైన నండూరి బంగారయ్యగారి మాటలలో "మానవుని స్థూలదృష్టికి దుర్యోధనుని మూర్ఖత్వము గోచరించును. సూక్ష్మముగా పరిశీలించిన ఆ మూర్ఖత్వము శ్రీకృష్ణుని సంకల్పముయొక్క బాహ్య స్వరూపమని విశదమగును."

భూభారహరణమే. కృష్ణునియొక్క లక్ష్యము. సంధిపట్ల అతనికంత విశ్వాసములేదు. కృష్ణునిసంకల్పసిద్ధికి సుయోధనుని పట్టుదల తోడ్పడినది.

బహిరంగమున కృష్ణద్వేషి అయ్యీ అంతరంగికముగ దుర్యోధనుడు కృష్ణునిపట్ల అత్యంత భక్తితాత్పర్యములు కలవాడు అని మనము భావింపవచ్చును.

ఉన్నతాశయములతోనే ఆచార్యులవారి కౌరవేంద్రుడు రంగప్రవేశము చేసెను. దుర్యోధనార్జునుల సాహసమును వివరించుచూ దుర్యోధనుడు అర్జునునికంటె సాహసరసికతలో మిన్నయైనవాడని నిరూపించిరి.

కురుక్షేత్ర యుద్ధము ప్రారంభమగువరకు అవార్యవీరోత్సాహమును ప్రదర్శించిన అర్జునుడు యుద్ధభూమినిచేరేసరికి ధైర్యము కరగి నీరైపోయెను. హృదయము దుర్బలమగును. అప్పుడు శ్రీకృష్ణుని విశ్వరూపావలోకనముతో తన సాహసమునంతటిని సంతరించుకొని యుద్ధోన్ముఖుడగును. కర్ణుని చంపునపుడు అర్జునుని మనసు కరగిపోవును. ధైర్యము సడలును. కర్ణుని చంపజాలనని సారధియగు కృష్ణునికి విన్నవించును. అంతకుముందుచూచిన విశ్వరూప తత్వమును విస్మరించును. తాను చంపువాడని, కర్ణుడు చంపబడువాడని, ఈకృత్యము వల్ల తాను హత్యాపాతకమునకు గురియగునని భావించును. అపుడు శ్రీకృష్ణుడే అర్జునునికి బుద్ధిచెప్పును.

ఈ రీతిగా అర్జునుని మనోదౌర్బల్యము అక్కడక్కడా కానరాక పోదు. కాని దుర్యోధనునిలో మాత్రం ఈ హృదయ దౌర్బల్యము ఎచటనూ కానరాదు. ద్వైపాయన సరోవరమున దాగియుండినపుడు అచటినుండి వెలువడి తానొక్కడు పాండవులైదుగురిని చూచినపుడు కూడ అతడేమాత్రము చలించడు. అయిదుగురిని యుద్ధమునకు ఆహ్వానిస్తూ గర్జిస్తాడు. ఏకాకియై ఉత్తర గోగ్రహణ సమయమున సమ్మోహనాస్త్రముచే దుర్యోధనునితోసహ కురుసేన నంతటినీ జయించిన అర్జునుని సాహసమును మనము తక్కువగా భావించుటకు వీలలేదు. ఉత్తరగోగ్రహణ సమయమున అర్జునుడు ప్రదర్శించిన సాహసముకంటె

నిస్సహాయుడై ఒంటరిగనున్నప్పటికీ నిర్భయముగ తన శత్రువు నెదిరించి అసువులు బాసిన సుయోధనుని సాహసము అత్యంత ప్రశంశనీయముకాదా!

ఒకరీతిగ చూచిన శ్రీకృష్ణుని మనస్తత్వమును అర్జునునికంటె దుర్యోధనునికి ఎక్కువగా విదితమైనట్లు స్పష్టమగుచున్నది. కృష్ణుని నిజోద్దేశమును తిక్కన మహాకవి చక్కగా బహిర్గతమొనర్చినాడు. "దైవనిర్ణయమెట్లున్నదో అట్లేకానిండు. నేను నిమిత్తమాత్రుడను" అని చెప్పుటకుకూడ అప్పుడప్పుడు మనోదౌర్బల్యమునకు గురియగు అర్జునునికంటె దుర్యోధనుని మనోబలము గొప్పదని స్పష్టమగును.

పై అంశములు రాఘవుని దుర్యోధనుని పాత్రలో స్పష్టమగును. ఈ విషయమును గ్రహింపని కొందరు ఆచార్యులవారి దుర్యోధనుని అర్థము చేసికొనకపోయిరి. "ద్రౌపదీ మాన సంరక్షణము" తెలుగు చలన చిత్రములో ఆచార్యులవారి దుర్యోధనుని అర్థముచేసుకొన్న వారెవరు? అర్థముచేసుకొని నవ్వినవా రెందరుకలరు? మయనిర్మితమైన పాండవుల సభను దుర్యోధనుడు ప్రవేశిస్తాడు. ప్రాంగణములోనే కొద్దిగా తొట్రుపడతాడు. కాని ఆ చిన్న తొట్రుపాటుతోనే రానున్న అపశకునమును అతిసున్నితముగా ప్రదర్శించినారని తెలిసికొన్న వారెందరు? భావ సూక్ష్మత స్థూలదృష్టికి గోచరమగుటకు హృదయ సంస్కార మవసరము.

## రావణేంద్రుడు

మనలో కొందరు నాటకకర్తలు, నటులు అనుసరించే పద్ధతులు చాలా విచిత్రంగా వుంటాయి. హిరణ్యకశిపు, రావణ, కంస, దుర్యోధనాది పాత్రలను చిత్రించుతీరు విచిత్రంగా వుంటుంది. వారి దృష్టిలో వీరందరూ రాక్షసులు, దుష్టాత్ములు, హంతకులు. కాని

హిరణ్యకశిపుని తపోబలాన్ని, రాజ్యపాలనా దక్షతను. రావణేంద్రుని శివపూజానురక్తిని, భక్తితత్పరతను, త్రైలోక్య పూజ్యత్వమును, కంసుని కార్యదీక్షను, కృష్ణునిచేత నిహతుడుకావలెనని వువ్విళ్ళూరిన దుర్యోధనుని మనోవృత్తి సంపత్తి, మున్నగువిషయాలను చాలామట్టుకు విస్మరిస్తారు. ఈ పాత్రలోని సుగుణములనెత్తి చూపుటకు అవకాశ మివ్వరు. ఈ లోపము తెలిసి చేస్తున్నారో, తెలియక చేస్తున్నారో అనూహ్యంగా వుంది. నటులుకూడ పై అంశములను విస్మరించి నటించుట విషాదకరము. పైపేర్కొన్న పాత్రలలో దుర్గుణములు లేవనికాదు. బాగా ఆలోచిస్తే సుగుణాలలో దుర్గుణాలు, దుర్గుణాలలో సుగుణాలు మిళితములై ఒక్కొక్కమారు పడగలెత్తి తమ మంచి చెడులను ప్రదర్శింపక మానవు. నాటకకర్తలు యీ విషయాన్ని గమనించి ఇటీవలకొన్ని నాటకములు రచించియుండుట సంతోషకరము. కాని వీటిలో ఎక్కువగా శ్రవ్యనాటకాలేవుండి దృశ్యకావ్యములు అల్ప సంఖ్యాకములుగ నుండుట విషాదకరము. ప్రసిద్ధ కన్నడ నాటకకర్త శ్రీ సి. కె. వెంకటరామయ్యగారు రచించిన "మండోదరి" ప్రశంస నీయమగు రచన. పౌరాణిక గాథనే ఎన్నుకొని సమకాలీన సమాజ చిత్రణము చక్కగా ప్రతిఫలింపజేసినారు. ఈనాటకరచనలో రాఘవగారి సలహాలు, ఆశయాలు ఎంతగానో తోడ్పడినవి. అంతేకాక రాఘవ అభినయ కౌశలము నాటకానికి మెరుగులు దిద్దింది. బెంగుళూరు అమెచ్యూర్ సంఘమువా రీనాటకాన్ని పలుమార్లు ప్రదర్శించి ప్రశంస లందుకొన్నారు.

ఈ నాటకంలో ప్రధానపాత్ర మండోదరి కాన, ఆ నాటకానికి ఆపేరు నెన్నుకోవడం సమంజసము. నాయిక ప్రధానంగా రచింప బడిన యీ నాటకము నూత్నపంథాలో సాగటమేకాక నాయికద్వార నాయకుని వ్యక్తిత్వ విశ్లేషణము జరిగింది. ఈ నాటకముయొక్క

నాయిక అయిన "మండోదరి" రావణుని భోగ్యవస్తువుకాక తనభర్త యొక్క భోగదృష్టిని త్యాగమువైపు మళ్ళించిన లోకమాన్యగా కానవస్తుంది. మహాసాధ్వియైన సీతాదేవిని అపహరించి తెచ్చిన పతిని జూచి దుఃఖిస్తుంది. సీతపట్ల అపచారాని కుద్యుక్తుడైన సమయంలో పతిని నిర్భయంగా ఎదురిస్తుంది. తన భర్తయొక్క తొల్లింటి సుగుణములను తలచుకొని, అశ్రుపూర్ణయై సీతను రామునికి కప్పగించ వలసిందని అర్థిస్తుంది. సీత దుఃఖములో భాగస్వామిని అవుతుంది. లంకాదహన సమయములో తన ప్రజలను విపత్తునుండి కాపాడునపుడు ప్రాణాన్ని లెక్కచేయక ప్రజల మధ్యకువెళ్ళి వారికి తోడ్పడుతుంది. త్రిలోక పూజ్యుడైన తన పతిని రక్షించుటలో వజ్రపంజరముగా మారుతుంది. ఈ రీతిగా మహోన్నత భావాలతో మండోదరి పాత్ర చిత్రణము వుదాత్తంగా సాగింది.

ఈ నాటకములోని రావణుడు ఇదివరకు కొందరనుకొన్నట్లు పదితలలు, ఇరువదిచేతులుగల రావణాసురుడుకాడు. రాఘవ కళా కౌశల్యము మరియు నాటకకర్తల ప్రతిభల మేళనముతో మనవలెనే ఒకతల రెండు చేతులుగల రావణేంద్రుడయినాడు. మహేశ్వర వర ప్రసాదియైనప్పుడు మిగిలిన పది తలలు మొలిచేవని ఆనంద రామాయణములో పేర్కొనబడినది. సిలోన్‌లో ప్రబలముగానున్న ఐతిహ్యముమేరకు రావణునికి పది తలలు లేవని నాటకకర్త తన పీఠికలో పేర్కొన్నాడు. ఈ ఆధారములను పురస్కరించుకొని రాఘవ రావణేంద్రునిగా రంగభూమిలో అవతరిస్తాడు. మండోదరి పాత్ర ఎంతఉత్తమత్వంతో కూడివుందో అంతే మదాత్తతతో రావణుని పాత్ర చిత్రితమైనది. ఏకైకదోషము కాముకుడై సీతాపహరణము చేయుట మాత్రమే.

ఈదోషముతప్ప రావణునిలో మనం మరేదోషమును చూడలేము. కౌరవేంద్రునికి, అసురేంద్రునికి యుగ వ్యత్యాసముతప్ప గుణ

వ్యత్యాసము ఏమియు కానరాదు. వీరిరువురు తమ దర్పముతోను, సామర్థ్యముతోను దైవమును మెప్పించిన వారనవచ్చును. మన పురాణాలలో యిందుకు తగిన ఆధారాలు మనకు లభించుచున్నవి. ఈ దర్పము, సామర్థ్యము కొందరు ఆస్తికులకు క్రూరంగా కానవచ్చి, వీరు దుష్టులని వాదించేందుకు చోటునిచ్చినవి.

## సుభద్రార్జునీయంలో రాఘవ

కీర్తిశేషులు ధర్మవరం గోపాలాచార్యులు "సుభద్రార్జునీయ" మను నాటకము రచించిరి. ఇది పురాణకాలమునాటి కన్యాపహరణ గాథ అనిఅందరికీ తెలిసినదే. వేద ప్రతిపాదితమైన చతురాశ్రమములలో చివరదిగా పవిత్రమైన సన్యాసాశ్రమముయొక్క పవిత్రతకు కళంకము తెచ్చిన వారిద్దరున్నారు. ఒకడు రావణుడు, మరొకడు ఈ నాటక కథానాయకుడైన అర్జునుడు. సామాన్యంగా మన సంభాషణలో ఈ ఇరువురిలో ఏ ఒక్కరినైన ఉదాహరించడం రూఢిగా జరుగుతూ వుంటుంది. ఈ రూఢివాక్యముయొక్క ఉద్దేశ్యము ఎట్లున్నప్పటికీ సన్యాసుల గుణగానం చేసేటప్పుడు ఎదుటివాడు అతడేమి అర్జున సన్యాసియా? లేక రావణ సన్యాసియా అని ప్రశ్నించును. ఇరువురు సన్యాస వేషమున స్త్రీలను ఎత్తుకొనిపోయినవారే. వేషము ఒకటే కాని వీరిలో కొంత వ్యత్యాసమున్నట్లు తోచుచున్నది. ఆ వేషంలో సన్యాసాశ్రమమునకు కావలసినంత అపకీర్తిని వారు తెచ్చిపెట్టినారు. కాని వ్యక్తుల గుణగణములను పరిశీలించినపుడు ఈవ్యత్యాసము కానవచ్చును. ఒకడు పతియున్న సాధ్విని అపహరిస్తే మరొకడు తన్నువలచివచ్చిన కన్యను అపహరించినాడు. ఇచట అపహరించిన వాని దోషముకంటె ఎత్తుకొనిపోయిన వాని దోషము అల్పముకాదా! ఈదోషము ఆ కన్య యొక్క బంధువుల దృష్టిలో మాత్రము తప్పిదము. వివాహమైనంత వరకూ ఆదోషము దోషంగావుండి చివరికి కన్యాపహారిఅనే ఎత్తిపొడుపు

మాటలలో మాత్రము ఆ దోషము మిగిలిపోతుంది. ఏమైనాకాని ఈ దొంగతనము ప్రజలకుపమానంగా ఉపయోగపడింది. అపహరించినవాడు అపరాధి, ఈ అపరాధికి తగిన శిక్ష విధించుటకే రామావతారము ప్రయోజకమైనది. భీష్ముడు తన శక్తిసామర్థ్యములను ప్రదర్శించి కాశీరాజు పుత్రికలైన అంబ, అంబిక, అంబాలికలను కన్యలను బలాత్కారముగా ఎత్తుకొనివచ్చి విచిత్రవీర్యునికి ముడివేసినాడు. వారిలో ఒకరుమాత్రము భీష్ముని చర్యను తీవ్రంగా విమర్శించి వెళ్ళిపోయిరి.

ఆచార్యులవారు శృంగార రసాభినయమునకు తగినవారుకారని కొందరి అభిప్రాయము. ఈ విమర్శకులకు సమాధాన మిచ్చుకొరకే రాఘవ అర్జునపాత్ర ధరించారు. ఈ నాటకములోని అర్జునుని పాత్ర సంగీత ప్రాధాన్యము కలది. సంగీతశాస్త్ర సాధనములేని ఆచార్యులవారు ఎట్లుఅభినయించగలరని కొందరికి సందేహము కలిగినది. హఠవాదియైన రాఘవ మాత్రము మౌనంగా ఎలావుండగలడు? అర్జున పాత్ర యొక్క వైశిష్ట్యమును తెలియనివారు కారాయన. పురాణయుగమున ప్రసిద్ధ యోధాగ్రణి యనిపించుకొన్న అర్జునుడు మహానాట్యాచార్యుడుగా కూడ ప్రసిద్ధి నందినవాడు. ఈకీర్తి భూలోకముననేకాక స్వర్గలోకము వరకు వ్యాపించినది.

ఒకమారు నాట్యశాస్త్ర విషయమున రంభ, ఊర్వశి ఇరువురి మధ్య వాగ్వాదము జరిగినది. ఈవాదము తీర్చుటకు దేవలోకమున సమర్థులు కానరాలేదు. తుదకు ఇంద్రుడు అర్జునుని పిలిపించుకొని వారి వివాదమును తీర్చెనట. అజ్ఞాతవాస కాలమున విరటుని కొలువుచేరి బృహన్నల రూపమున రాజపుత్రికలకు నాట్యవిద్యను నేర్పినట్లుగా భారతము చెప్పుచున్నది. ఇతనికి సంగీత శాస్త్ర పరిచయముండవచ్చును.

కాని అర్జునుడు గాన విశారదుడు అని పేర్కొన్నట్లు కానరాదు. విఖ్యాతుడైన నాట్యాచార్యుడనుట మాత్రం నిజము. పాత్రలపరిశోధనలో కుశలురైన ఆచార్యులవారు నాటకాలలోని సంగీతార్జునుని అభినయార్జునిగా మార్చినారు. ఈనాటకములోని అర్జునునికి సంగీత పరిచయము కలదనుటకు నిదర్శనముగా కొన్నిపద్యములను చేర్చుకొన్నారు. సంగీతమునకు అభినయమును జోడించిన అర్జునుడు మాయమై అభినయమునకు సంగీతము మేళవించిన ఆచార్యులవారి అర్జునుడు రంగభూమిపై అవతరించినాడు. కృష్ణుని మాటలచే పురికొల్పబడిన అర్జునుడు మహాభారతంలో తన యుద్ధ విద్యాకౌశలమును ఏరీతిగా ప్రదర్శించెనో అట్లే విమర్శకుల వెక్కిరింపులచే రెచ్చిపోయిన నాట్యకళా ప్రపూర్ణుడైన రాఘవ నాటక రంగముపై తమ అభినయ కళాకౌశలమును ప్రదర్శించిరి.

సంగీత కళాసాధకుడుకాని ఆచార్యులవారి లోపమువారి అభినయ కళాకౌశలమును భంగించినదికాదు. శృంగార రసభరితమైన అర్జునుని పాత్రను అత్యంత జయప్రదంగా అభినయించటంచూచి ప్రేక్షకులు విస్మయం చెందారు. ఒకవిధంగా విమర్శకులు కళను ప్రోత్సహించినారని చెప్పవచ్చు. ఈ విమర్శలవల్ల ఆచార్యులవారు అర్జునపాత్రకు నవ్యతను కల్పించినారు. కొన్నినాటక సమాజములు ఆచార్యులవారి అర్జునుని ఆదర్శంగా వుంచుకొని అభినయించుచున్నారు. ఆచార్యులవారు సంగీత ప్రాధాన్యముగల నాటకాలను ఎప్పుడైనా అభినయించారా? అని పరామర్శించినపుడు ఆపాత్రలు మనకంతగా కానరావు. తమయోగ్యతకు మించిన పనులు చేపట్టేవారు కారు రాఘవ. నటులు తాము ఏపాత్రకు తగియుందురో గమనించుట అవసరము. అహంభావము అడ్డురాకుండా జాగ్రత్త వహించుట అవసరము.

## చాణక్య

ప్రచండ చాణక్య లేదా చంద్రగుప్త అను హిందీ నాటకము ద్విజేంద్రలాల్‌రాయ్‌గారిచే రచింపబడి ఆంధ్రమున అనువదింపబడెను.

అనేక దృశ్యములు, పెక్కు పాత్రలు, యుద్ధ దృశ్యములు కల ఈ నాటకమును ప్రదర్శించుట కష్టము. ఆచార్యులవారు ఈనాటకమును కొద్దిమార్పులతో ప్రదర్శించి ప్రసిద్ధులైనారు,

ఈ నాటకములో ఆచార్యుల చాణక్య పాత్ర ప్రసిద్ధమైనది. ఆపాత్రలోవారు జీవించేవారు అన్నప్పుడు వారు మైమరచేవారుకారు. ఆచాణక్యుని తేజస్సు, తపోనిష్ఠ, సృష్టికి ప్రతిసృష్టి చేయగల మనోధైర్యం సమయోచిత తంత్రజ్ఞత, సాత్త్విక వేషధారణతో రంగభూమిని ప్రవేశించినపుడు, ప్రాచీనతపస్వుల తేజోవిలాసమును తలపింపజేసేవారు. శూద్రశక్తిచే ప్రేరేపితమైన ప్రతీకార వాంఛతో బ్రహ్మతేజమును మేళవించుచూ అర్ధనిమీలిత నేత్రములతో యోచనామగ్నతను ప్రదర్శించి వెంటనే సంకల్పము తరుముకొని వచ్చినటుల కనులు తెరచేవాడు. ఆసమయమున రాఘవ అభినయము అద్భుతము, అద్వితీయము.

ఆచార్యుల చాణక్యపాత్ర పోషణలో కొన్ని ప్రధాన ఘట్టములు మరపురానివి. నందోపహతుడు చాణక్యునికి భార్యా వియోగం కలిగింది. ఆమెకు ఉత్తరక్రియలు జరిపి తన కుటీరానికి చేరుకొనేసరికి తన ఏకైక పుత్రిక ఆత్రేయను దొంగలు ఎత్తుకుపోయినారు. అంధభిక్షకునికి ఆధారంగా తనముద్దుల కూతురు తాను నేర్పిన పాటనుపాడుచూ రావటాన్ని చూచిన రాఘవ అభినయము కరుణ రసపూర్ణము. హంతకులు సైతము కన్నీరు కార్చేదృశ్యమది. తనజీవితపు జ్యోతిగా ఎంచుకొన్న కూతురును పోగొట్టుకొని ఆమెకై వెదకుచు ఆమెను కనుగొనలేని నిరాశతో నవనందుల లయకేతువైన చాణక్యుని పాషాణ హృదయము కరగి నీరై పోయెను. అమ్మాయి పాటవిన్నంతనే చాణక్యుడు "అమ్మా! నీపేరేమి?" అని ప్రశ్నిస్తాడు. ఆబాలిక 'అచ్చి' అంటుంది. ఆమాటలు చైతన్యహీనమైన అతనిహృదయానికి అమృతోపమానంగా వినవచ్చినవి. 'అచ్చి' కాదు ఆ అమ్మాయి తప్పిపోయిన తనకూతురు 'అత్రి' అని

గ్రహించి ఆబిడ్డను కౌగలించుకొని అనందముతోను, దుఃఖముతోను ముద్దులాడును. పరస్పర విరుద్ధములైన ఈ భావములను రాఘవ అత్యంత సహజంగా అభినయించి ప్రేక్షకులను నిశ్చేష్టులుగా చేసేవారు.

చాణక్య పాత్రకు అవశ్యకమైన నటనావైదుష్యము. అపాత్ర నిర్వహణలో రాఘవచూపిన భావవైవిధ్యము పరస్పర పూరకములుగా వుండేవి. ఈపాత్ర భయానక, కరుణ, భీభత్స, అద్భుత రసముల మిశ్రణము. రాఘవ ఒక్కక్షణం పాషాణ కాఠిన్యం, మరోక్షణం పుష్ప మార్దవము. ఒక్కక్షణంలో నిర్భేద్యమైన తంత్రము. మరొక్కక్షణంలో పసిపాపలోని నిస్పృహాయత. ఒకమారు కపాలమాలికతో విజృంభించిన కాలరుద్రుడు. మరొకమారు మానవత మూర్తీభవించిన మహానుభావుడు. మందహాసంతోనే మృత్యువుయొక్క అట్టహాసాన్ని చూపగలమహానటుడు రాఘవ. ఇంతక్లిష్టమైన పాత్ర మహాభావుకుడైన రాఘవకోసమే వేచివున్నదా అన్నట్లుతోచును. కళాభిమానులందరికి రాఘవ చాణక్య పాత్ర షడ్రసోపేతమైన విందు.

న్యాయవాది రాఘవః- రాఘవ రంగూన్ ముదలైన పట్టణములలో ప్రదర్శనమిచ్చి 1927లో బళ్ళారి చేరుకొన్నాడు. ప్రభుత్వమువారు రాఘవను ప్రభుత్వ న్యాయవాదిగ నియమించిరి. రాఘవ తొమ్మిది సంవత్సరముల పాటు అపదవిలో నుండిరి. అపదవిలో నున్నప్పుడే అప్పటి బ్రిటిష్ ప్రభుత్వము ఆయనను 'రావుబహదూర్' బిరుదముతో సత్కరించింది. నాటియుద్ధనిధి సహాయార్థమై పెక్కు నాటకములను ప్రదర్శించి ప్రభుత్వమునకు లక్షలాది పైకమును లభింపజేసిరి. నాటక రంగముతో పాటు న్యాయవాదిగ రాఘవ సుప్రసిద్ధుడు. క్రిమినల్ కేసులను నడిపించుటలో అద్వితీయుడు.

అప్పట్లో కోలాచలం వెంకటరావు, పి. శివరావు, రాఘవ, బెల్డోణ భీమారావు, కోలారు వెంకోబరావు, తిమ్మకృష్ణరాయరు అను

న్యాయవాదులు విఖ్యాతులు వీరిలో శివరావుగారంటే ఎదుటివారికి సింహస్వప్నము. శివరావుగారిని ఎదిరించేందుకు ఏన్యాయవాది అయినా ముందుకువచ్చుటకు జంకెడివారు. రాఘవ ఒక్కడే ఆయనఎదుట నిలిచి వాదించే ధైర్యసాహసాలు గలవ్యక్తి. ఒకమారు శివరావుగారు సింహములా గర్జిస్తూ ''ఇదినాటకం కాదమ్మా" అనిరాఘవతో అన్నారు. అందుకురాఘవ''ఆ: తెలుసు, ఇదికోర్టులాలేదు. తమగర్జనామృగాలయం" అన్నాడు. ఆమాటలకు కోర్టులో అందరూ నవ్వుకొన్నారు. ఈ ఇరువురు న్యాయవాదుల వాగ్వాదములను వినుటకై జనులు న్యాయాలయములో గుమిగూడేవారు.

శివరావుగారి ఆక్షేపణలో నిజంలేకపోలేదు. న్యాయాలయములో రాఘవ తన కక్షీదారు పరంగా వాదించునపుడు, ఎదుటివారి వాదమును ఎదుర్కొనునపుడు అతనిఛలోక్తులు, హావభావాలు, వాదించుతీరు నాటకాభినయమువలె వుండేవని అందరికీ తెలిసినదే. ఆకర్షణీయమైన విగ్రహము ఆ ఉంగరముల జుత్తు మనం చాలమందిలో చూడవచ్చునేమోకాని భావపూర్ణములైన ఆనేత్రములు మాత్రము మనకు మిక్కిలి అరుదుగా కానవచ్చును. ఒకసారి జిల్లాన్యాయాధిపతి రాఘవవైపు తిరిగి''మీరు నావైపు చూడకండి, మీవాదాన్ని కొనసాగించండి" అన్నాడు. తరువాత కారణమేమని అడిగితే ''మీకన్నులలో ఎదుటి వ్యక్తిని ఆకర్షించే అసాధారణమైన మోహకశక్తి ఉంది"అని సమాధానమిచ్చారు, ప్రముఖ ఆంధ్రనాయకులైన గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఒకమారు ''గౌడగారు: రాఘవకు 'నాట్యకళా ప్రపూర్ణ' అను బిరుదము వచ్చింది కదా! ఆకళాపూర్ణత్వము వారిలో ఎక్కడుందో చెప్పండి:'' అనిఅడిగారు. అందుకువెంటనే సమాధానము గౌడగారికి దొరకలేదు. ఆయనే అందుకొని–రాఘవ మీకుమిక్కిలి సన్నిహితులు కదా: కళలన్నియువారి కన్నులలోనే వికసించినవి కదా: అన్నారు. వారిపలుకులు అక్షరాలా నిజము. భావప్రకటనకు అనువైనవారి నేత్రములు నాట్యరంగములోనే

కాక, రాఘవకు ప్రశంసలతో పాటు ప్రేమాదరములను కూడ లభింప జేసినవి. రాఘవ జీవితములో క్రమశిక్షణను చక్కగా పాటించేవాడు. తమవద్దకు వచ్చుకేసులలోని నిజానిజములను పరిశీలించి అది తన వాదనకు అందుబాటులో నున్నదని భావించినప్పుడే చేపట్టేవాడు. డబ్బు కోసమే ఎన్నడూ అతడు కేసులను పట్టేవాడుకాడు.

ఒకసారి ఒకకక్షీదారు ఆయనను తనపరంగా వాదించమని ప్రాధేయపడినాడు. ఆకేసుయొక్క సూక్ష్మస్వరూపమును గమనించిన ఆచార్యులవారు "వద్దయ్యావద్దు. నీవువకీళ్ళకిచ్చే డబ్బును ప్రతివాదికి చెల్లించి రాజీచేసుకొనుట మంచిది. ఈకేసు నెగ్గదు" అని నిర్మొహ మాటంగా చెప్పిరి. ఆసమయంలో ఏదోనాటక విషయమును చర్చించుటకై గౌడ అచట వుండినారు. "చూచారా గౌడ! ఇటువంటి వాళ్ళనుచూస్తే మనవూరిలోని లాయర్లకు పండుగ, ఇంకా కొంతమంది వున్నారు. కేసుఓడిపోవుటకు కావలసిన విషయాలన్నీ సేకరించి గెలిచే అంశాలనే వదలి వేస్తుంటారు. ఇప్పుడు వచ్చివెళ్ళిన కక్షీదారు నేచెప్పిన వకీళ్ళనే ఆశ్రయిస్తాడు చూడండి" అని నవ్విరి.

రాఘవలాంటి న్యాయవాదిని నియమించుకోవటం కక్షీదారులకు సామాన్యవిషయంకాదు. బాగాడబ్బువున్నవారే ఆయనవద్దకు వెళ్లేవారు. బీదలు తమబాధను విన్నవించుకొన్నప్పుడు ఉదారంగా సహాయపడేవారు.

ప్రజాహిత కార్యక్రమాల సహాయానికై తమవద్దకు వచ్చినవారికి లేదనకుండా పైకం ఇచ్చి పంపేవారు. వారిఇల్లొక ధర్మశాల. ఎక్కడ ఎక్కడనుండియో వచ్చినపండితులు, కవులు, నాటకకర్తలు నెలలకొలది వారిఇంట వుండి పోయేవారు. సుప్రసిద్ధ కన్నడనాటక కర్త టి.పి. కైలాసంగారికి రాఘవగారి ఇల్లుపుట్టినిల్లుగా ఉండేది. ఒక్కొక్క మారు నాలుగైదునెలలు నిశ్చింతగా రాఘవ ఇంట్లో వుండేవారు. వారి నివాసానికి అవుట్‌హవుస్ ఎల్లప్పుడు సుసజ్జితంగా వుండేది. కైలాసం

రాత్రంతా ఏదేదోరాస్తూ చించివేస్తూ ఉదయానికి తనకవితను రాఘవకు వినిపించేవారు. కైలాసం రాఘవను 'రెగ్గీ' అని తమాషాగాపిలిచేవారు. పండిత తారానాథ్ కూడా అప్పుడప్పుడు వచ్చివుండేవారు. వచ్చిన వారికి రాఘవగారి ఇల్లు ప్రసాదమందిరమేకాక కళామందిరంగా వుండేది.

రాఘవ బీదప్రజలపట్ల మిక్కిలి ప్రేమాభిమానములు కలిగి యుండిన వారనుటకు నిదర్శనము హరిజన పిల్లలకై వారు స్థాపించిన పాఠశాలయే. ఏడాదికోమారు బీదలకు కంబళ్ళు, దుస్తులు, చీరలు మున్నగు వాటిని ఉచితంగా పంచిపెట్టేవారు. న్యాయవాద వృత్తిలో ప్రతి నెలా సంపాదించిన వేలకొలది పైకము ఈరీతిగా వ్యయమయ్యేది.

రాఘవ ఒకకేసు తీసికొన్నారంటే తప్పక గెలుస్తామనే భావము ప్రజలకుండేది. వారు ఆకేసుయొక్క మూలతత్వమును శ్రద్ధగా అధ్యయనము చేసెడివారు. వేకువనేలేచి విద్యార్థివలె ఆనాడు కోర్టులో వాదించుటకు కావలసిన వివరణలన్నీ సిద్ధపరచు కొనేవారు. ఉదయము ఏడునుండి తొమ్మిదిన్నరలోపుగా, ఆఫీసుకార్యక్రమాలను ముగించుకొని వేళకుసరిగా కోర్టుకు వెళ్ళి, సాయంకాలంఅయ్యేసరికి తాను న్యాయవాది కాడేమో అనునట్లు నాటకాభ్యాసములో మునిగిపోయేవారు. ఆవేళలో కక్షీదారులను ఎవరినికూడ వారిబంగళా కాంపౌండు దాకా కూడ రానిచ్చేవారుకాదు. తనకక్షీదారులపైన రాఘవకు మిక్కిలి అభిమానము. ఎన్ని కార్యక్రమములున్నను తమకక్షీదారులను మాత్రం విస్మరించేవారు కారు. వీలైనంతవరకూ సత్యానికి సమీపంగా వుండేకేసులనే చేపట్టేవారు. ఒకమారు వీరశైవ మతమునకు చెందినకేసు ఒకటి వారుచేపట్టవలసి వచ్చింది. అందులో దాదాపు కేసుఓడిపోయే పరిస్థితి దాపురించింది. ఆమతంయొక్క శిష్యులు చిన్నఅబద్ధం పలికితేచాలు, రాఘవ కేసు విషయమంతా వివరించి ఒకఅబద్ధం చెప్పవలసిందిగా ఆశిష్యులకు తెలిపిరి. వారు వెనుకంజవేయసాగిరి. రాఘవ నవ్వుతూ "అయ్యా!

మీరు శివభక్తులు. లోకానికి వచ్చిన ఆపదను పరిహరించుటకు శివుడు విషమునే మ్రింగినాడు. మీస్వాములవారి మఠమును మిగుల్చుకొనుటకు మీరు ఒకేఒక చిన్నఅబద్ధాన్ని చెపితేఏమి?" అంటూ వారినిఒప్పించిరి. ఈ చర్చ సాగుతున్నప్పుడు గౌడ అక్కడే వుండటం తటస్థించినది. ఆచార్యులు గౌడవైపుతిరిగి "గౌడా!మీదేదైనా కేసు ఉందా?" అన్నారు. "లేదండి. ఆస్థితి ఇంకారాలేదు" అన్నాడు. వారు నవ్వుకొన్నారు.

ఆచార్యులవారు సమయోచిత ఛలోక్తులు విసరుటలో సమర్థులు. ఒకమారు 'క్లబ్'లో వేరేవూరినుండి వచ్చిన స్నేహితులొకరు ఆషామాషీగా మాట్లాడుతూ. "ఆచార్యులవారూ, మీబళ్లారిలో గాడిదలు ఎక్కువగా వున్నాయండీ"అన్నారు. వెంటనే సమాధానంగా "అవునవును. అవి చాలవన్నట్టు వేరేవూళ్ళనుండి కూడావచ్చి పోతూవుంటవి అన్నారు.

ఈ రీతిగా రాఘవ స్నేహితులమధ్య, కక్షీదారులమధ్య నాటక ప్రియులమధ్య రాజకీయ వాదులమధ్య అధికారులతోను సామాజిక కార్యక్రమములలోను జీవితమును సాగించుచూ ఆయారంగములలోని సుఖదుఃఖములలో దుఃఖమును త్యజించి సుఖాన్నేగ్రహించి ఆనందించు చుండెడివారు.

చివరివరకు వీరిదొక'క్లబ్' వుండేది. అందులో సభ్యులిద్దరే! ఒకరురాఘవ మరొకరు వారిమిత్రులు, వట్టం శ్యామారావు. ఆక్లబ్‌పేరు 'నోరిగ్రేట్‌క్లబ్' చివరివరకు మూడవ సభ్యునికి ప్రవేశములేదు. బళ్ళారిజిల్లా న్యాయాధిపతిగా 'జస్టిస్‌మ్యాక్' వుండేవారు. వారు రాఘవకు అతిసన్నిహితులు. రాఘవపట్ల ఆయనకు అమితమైన ప్రేమ. ఒకమారు వారు న్యాయాలయములోవారు ఇతర న్యాయవాదులను చూస్తూ "మీరు వాదిస్తూవుంటే ఒళ్ళంతా కళ్ళుచేసుకొని మీవాదన వింటూవుంటాను. రాఘవగారు మాట్లాడుతుంటే కళ్ళుమూసుకొని నెమ్మదిగా వింటూ వుంటాను. మీ వాదనావైఖరిలో సహజత్వము అవసరము" అన్నారు.

శ్రీమ్యాక్,' రాఘవయొక్క నాట్యకళోపాసనపట్ల అత్యంత గౌరవ భావము కలిగివుండేవారు. వారిన్యాయవాదిత్వముపట్ల సుహృద్భావము కలిగియుండేవారు. బళ్ళారిప్రజలు నిర్మించుకొన్న క్రీడాంగణమునకు 'మ్యాక్ స్టేడియమ్' అనిపేరు పెట్టి ఆన్యాయాధిపతిని అమితంగా గౌరవించేవారు.

ఈరీతిగా తమ న్యాయవాదవృత్తి అత్యంత జయప్రదంగా సాగుతున్నప్పటికీ నాట్యరంగోద్ధరణమును గూర్చి వారుఎల్లప్పుడూ ఆలోచించేవారు. తాము సంపాదించిన ధనముతో దేశవిదేశములలో పర్యటన సాగించుచూ నాట్యకళకు మాన్యతను కల్పించుటకు సర్వదా యత్నించేవారు.

## రాఘవ పాశ్చాత్య పర్యటన

ఆచార్యులవారు విదేశపర్యటనము విలాసదృష్టితో చేసినదికాదు. నాటకకళ తత్వములను తెలిసికొనుటకువారు పర్యటన సాగించిరి. అది వరకు ఎందరో పాశ్చాత్యదేశములనుచూచి వచ్చినవారున్నారు. ఇష్టమువచ్చినరీతిగా వేలకొలది పైకమును వ్యయపరచినవారు వున్నారు. కాని కళకోసము ముఖ్యంగా అభినయ కళకోసము పాశ్చాత్యదేశములలో పర్యటించిన వారెందరున్నారు? ఈరంగమున ముదంజవేసినవారిలో ఆచార్యులవారే అగ్రగణ్యులనవచ్చును,

మనదేశమున దరిద్రదేవత తాండవమాడుచున్నదని విదేశీయులనుటలో అసత్యమేమియులేదు. కాని అచ్చటచ్చట సంపన్నులుండనే వున్నారు. కాని, ఆధనికుల సంపదలో నాటకకళాపోషణకు లభించేది అంతంతమాత్రమే. నాట్యకళ నిరాశ్రయమై దైన్యభావముతో పిడికెడు కూటికోసం వీధివీధినా తిరుగు బిచ్చగానివలె అత్యంత హీనస్థితికి గురియైనది. ఈదైన్యస్థితిని గమనించిన కళాప్రియులెట్లు సహింపగలరు?

14—7—31 న గుంటూరులో జరిగిన ఆంధ్రనాటక పరిషత్తులో సమావేశములకు అధ్యక్షత వహించిన హరీంద్రనాథ్ చటోపాధ్యాయ ఈరీతిగా అన్నారు,

ఇది బొంబాయిలో జరిగిన సంఘటన. ఒకపెద్దమిల్లు యజమాని ప్రోత్సాహముతో నలభై ఆరుమంది నటులతో నాటకం ప్రదర్శించిరి. ప్రదర్శనానంతరం ఆమిల్లు యజమాని పైకమిచ్చుటకు తటపటాయిస్తూ "ఎవరయ్యా వీటికంతకంటే యిస్తారు?" అనిప్రశ్నించాడు. అప్పుడు "నాకళకోసం మీలోపైకమిచ్చే వారెందరున్నారు?" అని వారిని ప్రశ్నించితిని. ఆమిల్లు యజమాని అహంకారముతో "అయ్యా! మీరు మరలా బొంబాయికి రాకుండావుందురా? మిల్లు యజమానులమైన మాసహకారము లేకుండా ప్రదర్శనలివ్వగలరా? అని ప్రశ్నించెను, హరీంద్రనాథ్ చటోపాధ్యాయ కోపముతో "నేటినుండి నేనుబీదలకోసం ఒకనాటకమును ప్రారంభింపనున్నాను" అని ప్రతిజ్ఞచేసిరి. కళలపైగూడ పెత్తనం చలాయించే ధనికవర్గమువారి అత్యాచారములను సహింపలేను అంటూ శపథంచేసిరి. సంపన్న వర్గములవారి ధనమదాంధతను హరీన్ తీవ్రముగా గర్హించిరి. ధనమున్నవారికి కళాభిరుచి లేకుండుట కళాభిరుచి వున్నవారికి ఆర్థికస్తోమత లేకుండుట సామాన్యంగా తోచుచున్నది. మానవత్వములేని ధనికునికంటె మానవత్వముగల నిరుపేదయైన కళాకారుని జీవితము ధన్యతమమైనదికదా! ఇట్టిధన్యజీవితం మన ఆచార్యులవారిది, అట్టిధన్యజీవిత సారమే వారికళ. శారీరక సౌకర్యాల కోసం ధనం అవసరము. ఆత్మోద్ధరణకు కళఅవసరము. నశ్వరమైన దేహోద్ధరణకై ప్రయత్నించుట వుత్తమమని రాఘవ అభిమతము. కళకోసమే ధనంకాని, ధనమునకై కళకాదు అని ఏదేశమైతే భావిస్తుందో ఆదేశముతోపాటు ఆప్రజకూడా వున్నతశిఖరాల నందుకుంటుంది. ఆచార్యులవారు జీర్ణావస్థలోనున్న నాటకకళారంగమును చూచి బాధపడిరి. సమాజము నటులను ఏవగించుకొనుట చూచి

దుఃఖించిరి. అభినయకళ ఆశ్రయము, ఆదరణలేక కేవలం కూటికోసం కోటివిద్యలన్నరీతిగా తిరస్కారమునకు, అవమానమునకు గురియగుట వారికి బాధకలిగించినది. పాశ్చాత్యదేశములలో నటులు నాటకకర్తలు ప్రజాదరణకు పాత్రులగుచుండగా భారతదేశమున కళాకారులకు సమాజములో గౌరవము లేకుండా పోయినది. అప్పటినటులు ఏరీతిగా సంఘగౌరవమును పొందుచున్నారు? ఇప్పటినటులు ఎందుకు అవమానింప బడుచున్నారు? అన్నవిషయములు వారిని ఎంతగానో బాధించినవి. ఈ బాధయే వారిని పాశ్చాత్యపర్యటనకు పురికొల్పినది. 1928 ఏప్రిల్ 26న బెంగుళూర్ అమెచ్యూర్ అసోసియేషన్‌వారు కాలేజియేట్ హైస్కూలులో రాఘవకు వీడ్కోలు ఇచ్చుటకై ఒక సభను ఏర్పాటుచేసిరి. పండితతారానాథ్ నాటిసభకు అధ్యక్షుడు. వారు రాఘవకృషిని ప్రశంసిస్తూ స్వామివివేకానంద, సర్వేపల్లి రాధాకృష్ణన్‌ల వలె వీరు మహోన్నతలక్ష్యముతో విదేశపర్యటనకు పూనుకొనుట మెచ్చుకొనదగినది అన్నారు. రాఘవ సన్మానానికి సమాధానంగా ''భారతీయ కళాప్రశస్తిని విదేశములలో ప్రకటించుటయే తమ ధ్యేయమని తెలియజేసిరి. 1928మేనెల 2వ తేదీన కొలంబోచేరి 'ఆస్టర్లీ' అనేనౌకనెక్కి ఇంగ్లండుకు పయనమైరి. సముద్రప్రయాణములో బాధలన్నింటిని సహించి లండను నగరమునకు చేరుకొనిరి. ఆమహానగరంలోని కళావేత్తలతో పరిచయం చేసికొనుట వారిప్రధాన కార్యక్రమమై వుండెను. ఆరుమాసముల తమపర్యటన కాలములో ప్రసిద్ధకళాకారుల నెందరినోవారు కలసికొనిరి. రెండునెలలపాటు లండను నగరములోనే వుండిరి. ఆసమయములో ఏబదియేడు నాటకములను చూచిరి. అపటి ప్రఖ్యాతనటులగు 'సర్‌ఫోర్బ్స్‌రాబర్ట్‌సన్' వారిసతీమణి మరియు హామ్డన్ మరియు అన్‌ట్లీడ్యూక్స్ (ప్రఖ్యాతనాటక విమర్శకుడు) జార్జ్ బెర్నార్డుషా మున్నగువారితో పరిచయం కలిగినది. జార్జి బెర్నార్డుషా రాఘవతో మాట్లాడుటకు పదినిమిషాలు వ్యవధిని

మాత్రమే ఇచ్చెను. "ఇదేమి? కళాధర్మములను, కావ్యమర్మములను భారతదేశమునుండి తెలిసికొనుటకు మేమే భారతదేశమునకు రావలసియుండగా మీరు మాదేశమునకు రావడము ఆశ్చర్యంగా నున్నది" అన్నాడు. నాటకకళనుగూర్చి నటననుగురించి జరిగిన సంభాషణలో రెండుగంటల కాలము గడచినది. షా రాఘవతో ఎన్నో విషయములను చర్చించినాడు. చివరకు షా ఎదుట 'మర్చెంట్ఆఫ్‌వెనిస్' లోని ఒక సన్నివేశమును రాఘవ నటించిచూపిరి. ప్రదర్శనానంతరము షా ఆయనను అభినందించుచూ "కేవలం గ్రంథస్థమైన మాటలను వల్లించుట నటనకానేరదు. సహజసంభాషణలతో కూడిన నటనయే ఉత్తమమైనది" అంటూ అభినందించెను. నటునికి ఆత్మశక్తి అవసరము. "నా రష్యన్ మిత్రుడొకడుండేవాడు. అతడు కుంటివాడు. వేషధారణ ముగించుకొని రంగస్థలము ప్రవేశించిన తరువాత అతడు కుంటివాడని ఎవరికీ తెలిసేదికాదు" అంటూ మరెన్నో విశేషములను రాఘవకు తెలియజేసిరి. బెర్నార్డుషాతో రాఘవ జరిపిన గోష్ఠివిశేషములను ప్రసిద్ధ పత్రికలన్నియు ప్రకటించినవి. ఇంగ్లండులో తాముచూచిన నాటకాలను గూర్చి రాఘవ ఇట్లన్నారు.

"వారి నాటకములు సాంఘిక ఇతివృత్తములతో కూడుకొన్నవే ఎక్కువ. రెండు లేదా రెండున్నర గంటలకు మించివుండవు. నటులు అత్యంత శ్రద్ధాసక్తులతో అభ్యాసము చేయుదురు. ప్రదర్శనమునకు ముందుగా ప్రసిద్ధనటులను విమర్శకులను ఆహ్వానించి వారిసూచనలను స్వీకరింతురు. సూచనలిచ్చినందుకు ఈపండిత, విమర్శకులకు సముచిత పారితోషికము లభించును. అటుతరువాత ప్రదర్శనము ఇత్తురు. అదేనాటకమును ఒకవారంపాటు వరుసగా ప్రదర్శింతురు. పత్రికలు విమర్శక వ్యాసములను ప్రకటించును. అటుతరువాత ఆ నాటకమును వరుసగా మూడు, నాలుగు నెలలపాటు ప్రదర్శించి మంచిరాబడి తీయుదురు. కాని మనదేశమున నాటకరంగములు ఇట్టి భాగ్యమునకు నోచుకొనలేదు. నాటకములపై పెట్టుబడి లాభదాయకముగా లేదు.

లండన్‌లో రాఘవ ఒకరష్యన్ నాటక ప్రదర్శనమును చూచెను. ఆనాటకములో మొదటి దృశ్యము ఒకపెద్దహోటల్ (ఫలహారశాల). ఏబది అరువదిమంది అల్పాహారము సేవిస్తున్నారు. వారందరు కూడా శిక్షితులైన నటులు. ప్రతియొకరు విశిష్టమైన హావభావములను ప్రదర్శిస్తున్నారు. వారినటనను చూచి రాఘవ విస్మితులైనారు.

లండన్‌లోవున్నప్పుడు వారు 'ఇండియన్ స్టూడెంట్స్‌హోమ్'లో భారతీయులు హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ దర్శకత్వమున ప్రదర్శించిన 'కుంభరాణా' 'మీరాబాయి' నాటకములను చూచిరి. రాఘవ కళావైదుష్యమును ఎంతగానో ప్రశంసించిరి. రాఘవకు రంగస్థలము పట్లగల అభిప్రాయములను భారత నాటకకళారీతులను గ్రహించిన ఆంగ్ల కళాకోవిదులు పెక్కుగోష్ఠులలో రాఘవను సత్కరించి సమావేశములను ఏర్పరచిరి. వారిగౌరవార్థము పెక్కు విందులిచ్చిరి. జగత్ప్రసిద్ధమైన 'గ్యారిక్‌క్లబ్'లో రాఘవ గౌరవార్థము గొప్పవిందు జరిగింది. విఖ్యాతనటుడైన 'సర్‌ఫోర్బ్స్ రాబర్ట్‌సన్' అతని సోదరుడైన ప్రసిద్ధ నటుడు 'సౌరబ్‌రాబర్ట్‌సన్' 'లేడీ రాబర్ట్‌సన్' 'విన్‌స్టన్‌చర్చిల్' బెర్నార్డుషా, సర్‌ఆర్థర్ పినెరో మున్నగు ప్రఖ్యాత కళాకారులు నాటక విమర్శకులు వచ్చిరి. రాఘవ ఇంగ్లండు పర్యటన పూర్తిచేసికొని వెళ్ళుతున్నప్పుడు 'గ్రాయిన్' అనేప్రఖ్యాత విమర్శకుడు 'డెయిలీన్యూస్' అనే పత్రికలో రాఘవ నటనా పాటవమును గూర్చి సుదీర్ఘమైన విమర్శనావ్యాసమును ప్రకటించెను. కొంతకాలము "సెక్రటరీ అఫ్‌స్టేట్ ఫర్ ఇండియా" పదవిలోనుండిన లార్డుహాల్డేన్ రాఘవను ప్రత్యేకంగా సన్మానించెను. రాఘవ ఆంగ్ల రంగస్థలమును గురించి నటీనటులనుగురించి చేసిన విమర్శలు వారికి ఆశ్చర్యము కలిగించినవి. భారతదేశములోని రంగస్థలమును గూర్చి వ్రాసిన గ్రంథములను చదువసాగిరి. భారతనాటక రంగమునకు తమచేతనైన సహాయము చేసెదమని తెలిపిరి. అమెరికన్ సంస్థలు రాఘవను అమెరికా

పర్యటించ వలసినదిగా ఆహ్వానించిరి, అమెరికానుంచి వచ్చిన ఆహ్వానమును రాఘవ అంగీకరించ లేకపోయిరి. అప్పుడు పారిస్‌లో జరిగిన అఖిల ఐరోపా థియేట్రికల్ కాంగ్రెస్ నాటక సమ్మేళనములో ప్రత్యేక ఆహ్వానముపై రాఘవ పాల్గొనిరి. ఆయన 'భారతీయ నాట్యకళావైశిష్ట్యము' అనుఅంశముపై ప్రసంగించి ప్రశంసలందుకొనిరి. పారిస్ నగరములోని నాటక సంఘముల గోష్ఠులలోనేకాక జర్మనీవెళ్ళి అనేకసభలలో నాటకకళలను గూర్చి పెక్కువుపన్యాసములు గావించిరి. ఈ విధంగా రాఘవ ప్రాచ్యపాశ్చాత్య నాటకరంగములకు ఒకసద్భావ వారధిని నిర్మించిరి.

## ఆచార్యుల కళాసేవ

రాఘవ పాశ్చాత్యపర్యటన పూర్తిచేసుకొని స్వదేశమునకు రాగానే భారతీయ నాటకసంఘములో నటులు కళాకారులుపెక్కురు వారిని ఘనంగా సత్కరించిరి. ప్రసిద్ధపత్రికలు భారతీయ కళావైశిష్ట్యమును పాశ్చాత్య దేశములలో ప్రచారమొనర్చిన ఆయన కృషిని వేనోళ్ళ కొనియాడినవి. రాఘవమాత్రం రేయింబవళ్ళు భారతీయ నాటక రంగోద్ధరణ విషయము గూర్చి తీవ్రముగా ఆలోచించసాగిరి. అనేక సభలలో పాల్గొని తమ అనుభవాలను, పాశ్చాత్యదేశాలలో నాటకరంగ ప్రగతిని విశదీకరించుచూ వుపన్యసించిరి. దేశాభ్యుదయమునకు ఉపకరించని నాటకప్రయోగములు నిష్ప్రయోజనములు అన్నారు. కాలానుగుణ్యముగా సమాజములు ఉన్నతపథమువైపు మళ్ళింపగల నాటకముల అవసరమును నొక్కిచెప్పిరి. నాటకములలో స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించవలెనని తీవ్రముగా వాదించిరి. నాటక ప్రదర్శనములకు అనువైన రంగస్థలములు నిర్మించడం అత్యవసరమని పేర్కొనిరి. నటనలో శిక్షణకై ప్రధానకేంద్రములలో నాట్యవిద్యాలయములు నెలకొల్పవలెనని సూచించిరి. నటుల సహాయార్థమై నాట్యసంఘములు

'యాక్టర్ ఫండ్' (నటులనిధి) ఏర్పాటుచేయవలెననిరి. ప్రాచ్యపాశ్చాత్య నాటకరంగములోని బాగోగులను వివరించిరి. సాహిత్య ప్రపంచములో పత్రికలకు ఎట్టిస్థానముందో అట్లే నాటకకళా ప్రదర్శనములు అవసర మన్నారు. ఉపన్యాసములంటే రాఘవకు అంతగా నచ్చేవికావు. తమ ఆలోచనల కనుగుణ్యముగా నాటకప్రదర్శనములు ఏర్పాటు చేయదలచి ప్రదర్శనమునకు పూనుకొన్నారు. తమ ఆశయాల కనుగుణ్యముగా ప్రజాభిప్రాయములను తీర్చిదిద్దుటకై బెంగుళూరు అమెచూర్ సంఘమువారితో బొంబాయి, కలకత్తా, సిమ్లా మొదలైన ప్రముఖ నగరములలో హిందీ, ఇంగ్లీషు, తెలుగు, కన్నడ నాటకములను ప్రదర్శించిరి. రాఘవ ప్రదర్శించుచుండిన నాటకములను గూర్చి 'భారతి' పత్రికలో శ్రీ మున్నంగి శర్మగారు ఇట్లువ్రాసిరి. 'తెలుగు దేశములో రాఘవ నాటక ప్రదర్శనమివ్వని పట్టణమంటూ లేదు. నిధి సేకరణకై పెక్కుసంస్థలు ప్రదర్శనములిచ్చుటకై ఆహ్వానించు చుండిరి. ఆహ్వానములను తిరస్కరించుట ఎరుగనివాడు రాఘవ. బెజవాడలో, బెంగుళూరులో, బళ్ళారిలో నాట్యవిహారము చేసే కళారాధకు డాయన. ఈ ప్రదర్శనలు స్వలాభమునకే కాక కళారాధనకుద్దేశింప బడినవి.

శ్రీ శర్మగారి మాటలలో అతిశయోక్తిలేదు. బెంగుళూరులో మద్రాసులో నాటకములు ముగించి ఆరంగులతోనే రైల్వేస్టేషన్ చేరేవారు. రైలుపెట్టెలో కూర్చుని ప్రయాణముసాగిస్తూ తమరంగులను తోముకొనేవారు.

నిర్విరామంగా నాటక ప్రదర్శనములలో పాల్గొనుచుండినప్పటికీ రాఘవ తమన్యాయవాది వృత్తిని అత్యంత శ్రద్ధాసక్తులతో సాగించు చుండెడివారు. ఒక్కొక్కమారు రైల్వేస్టేషన్నుండి నేరుగా

న్యాయాలయమునకు వెళ్ళేవారు. తన్నునమ్ముకున్న కక్షీదారులకు ఎట్టి ఇబ్బంది కలుగకుండ శ్రద్ధవహించేవారు. నాట్యకళపట్ల ఎంతటి శ్రద్ధాసక్తులను ప్రదర్శించేవారో అంతేశ్రద్ధతో న్యాయవాదవృత్తిని సాగించేవారు. నాటకములంటే నీచభావముతో చూచే పెద్దలు క్రమంగా తమ అభిప్రాయములను మార్చుకొన్నారు. నాటకములలో పాల్గొనుటకు ఇష్టపడేవారు. ఆచార్యులవారి కళామయ జీవితంలో ముఖ్యఘట్టము లెన్నియోకలవు. కోలాచలం శ్రీనివాసరావుగారిచే రచింపబడిన 'సుల్తాన్ చాంద్‌బీ' అనునాటక ప్రదర్శనము బళ్ళారిలో క్రొత్తగా నిర్మింపబడిన నాటకశాలలో ప్రారంభమైనది. లోకమాన్య బాలగంగాధర తిలక్ ఆ నాటక ప్రదర్శనమునకు విచ్చేసిరి. ఆనాటకములో రాఘవ ఉస్మాన్‌ఖాన్ పాత్రాభినయము లోకమాన్యుని ప్రశంసకు మిక్కిలి పాత్రమైనది. జగద్విఖ్యాతుడైన రవీంద్రనాథ్ టాగూర్ బెంగుళూరికి విచ్చేసినపుడు, అమెచూర్ నాటకసంఘమువారు ఒథెల్లో నాటకమును ప్రదర్శించిరి, రవీంద్రకవితోపాటు వారిమిత్రులు సి. ఎఫ్. ఆండ్రూస్ కూడా నాటకము చూచుటకు వచ్చియుండిరి. రాఘవ వేషభూషణములపై ఎక్కువ ఆసక్తిని చూపలేదు. సామాన్యదుస్తులతోనే అభినయించిరి. సహజత్వము వుట్టిపడే అభినయ కౌశలమును చూచి రవీంద్రుడు మిక్కిలి సంతోషించెను. ప్రదర్శనానంతరము రాఘవయొక్క కళాప్రతిభను ప్రశంసించెను.

తరువాత రవీంద్రకవి మైసూరుకువెళ్ళి వరదాచార్యులుగారు నటించిన 'ప్రహ్లాద' నాటకమును చూచిరి. వరదాచార్యులుగారు కన్నడ రంగస్థల పునరుద్ధరణకు మిక్కిలి కృషిచేసిన ప్రతిభావంతుడు. అతడు అభినయముననే కాక సంగీత సాహిత్యములందు ఆరితేరినవాడు. రవీంద్రనాథ్ ఠాగూర్, వరదాచార్యులుగారి హిరణ్యకశిపు పాత్రాభినయమును చూచి సంతసించిరి. "రాఘవా చార్యులు కూడ ఈ పాత్రను అభినయింతురా?" అని బెంగుళూరు అమెచూర్ సంఘము

వారిని ప్రశ్నించెను. రవీంద్రుని కోరికమేరకు మైసూరులో ప్రహ్లాద నాటకము ప్రదర్శింపబడినది. రాఘవయొక్క ప్రతిభాపూర్ణమైన అభినయ కౌశలమును చూచిన రవీంద్రకవి మిక్కిలి ఆనందించెను.

ఆచార్యులిరువురు హిరణ్యకశిపు పాత్రాభినయము చేయుట చూచిన రవీంద్రుడు ఆశ్చర్య చకితుడైనాడు. వరదాచార్యుల హిరణ్యకశిపుడు సంగీత ప్రధానుడు. రాఘవాచార్యుల హిరణ్యకశిపుడు అభినయ ప్రధానుడు. పురాణ హిరణ్యకశిపుని చూచిన వారెవరూలేరు. భిన్నరీతుల అభినయము చూచిన ప్రేక్షకులకు ఆప్రదర్శనము అద్భుతానంద కరముగా నుండినది. నాట్యశాస్త్ర కళాప్రపూర్ణుడైన రవీంద్రుడు ''కళాసరస్వతి యొక్క రెండు కన్నులవలె వెలుగునట్టి ఆచార్యద్వయమును కన్న దేశము ధన్యమైనది''అన్నారు. తమ శాంతినికేతనమునకు విచ్చేసి, ప్రదర్శనలిచ్చునట్లు ఆహ్వానించిరి.

ఒకమారు గాంధిజీ బెంగుళూరు వచ్చినపుడు అమెచూర్ సంఘమువారు పండిత తారానాథ్‌గారు హిందీలో రచించిన 'దీనబంధు కబీర్' నాటకమును ప్రదర్శించిరి, ఆనాటకములో రాఘవ ప్రధానపాత్రధారి. శ్రీ సి. రాజగోపాలాచారితో పాటు వచ్చి గాంధీజీ ఇరువది నిముషములు మాత్రం ప్రదర్శనము చూచునట్లు నిశ్చయించు కొనియుండిరి. భక్తిరసపూర్ణమైన రాఘవ అభినయ కౌశలముచూస్తూ గాంధీజీ కాలనియమమును విస్మరించిరి. రాజాజీ 'ప్రార్థనకు వేళైనది' అన్నప్పుడు "ఇది ప్రార్థనకాదా?" అంటూ నాటకము చూచుటలో తన్మయులైనారు. నాటక ప్రదర్శనములుచూచు అలవాటులేని గాంధీజీ ప్రదర్శనము చివరివరకు చూచి 'రాఘవాచారి మహరాజ్‌కుజై' అంటూ హర్షధ్వానములు చేసివెళ్ళిపోయిరి, ఆనాటి ప్రదర్శనకు వసూలైన మొత్తము హరిజన సేవాసంఘమునకు సమర్పించడమైనది.

ఏబదియేళ్ళ క్రితంవరకు కులీనస్త్రీలు నాటకములలో పాత్ర వహించుటకు జంకెడివారు. నాటకములలో పాల్గొనుట గౌరవప్రదం కాదని వారితలంపు. పాల్గొన్న స్త్రీలను అమర్యాదగా చూచేవారు.

ఈ పరిస్థితిని గమనించిన రాఘవాచార్యులు పురుషులతోనే స్త్రీ పాత్రలు ధరింపజేసి ప్రదర్శనము లిచ్చుచుండెడివారు. నేటివలె నాటిస్త్రీలు చదువుకొనుటలో ముందంజ వేసేవారుకారు. స్త్రీలను రంగస్థలమునకు తీసికొనిరావడం సాహసకృత్యమై యుండినది. రాఘవ తమ ఉపన్యాసములలో స్త్రీపాత్రలను స్త్రీలే ధరించవలెనని పెక్కుచోట్ల సూచించిరి, కాని పెక్కురు ఆచార్యుల అభిప్రాయముతో ఏకీభవించక పోయిరి. పురుషుడు ఎన్నివిధాల ప్రయత్నించినా సహజముగా స్త్రీపాత్రను ధరింపలేడు. వేషంవల్ల పురుషస్వరూపము మారినా పురుషస్వభావం మాత్రం మారదు. స్త్రీలోని మాతృప్రేమ, పతిప్రేమ ఈరెంటిని పురుషుడు సమర్థవంతముగా ప్రకటించలేడని రాఘవ విశ్వాసము. స్త్రీలు లేని రంగస్థల నాటకం కళాత్మకంగా సంపూర్ణంకాజాలదు. ముందు ముందు సాంప్రదాయ వాదులుకూడ ఈ అభిప్రాయాన్ని మన్నిస్తారు అంటూ విద్యావంతులైన స్త్రీలు నాటక ప్రదర్శనములలో పాల్గొన వలసినదిగా స్త్రీలకు విజ్ఞప్తిని చేసిరి. మొదట వారి అభిప్రాయమునకు అంతగా ప్రోత్సాహము లభింపలేదు. క్రమముగా కొందరు స్త్రీలు ముందుకు వచ్చిరి. ఈ విధముగా స్త్రీలే స్త్రీపాత్రలు ధరించడానికి కారణభూతులైనారు రాఘవ. అందుకు ముందంజవేసిన మహిళలలో శ్రీమతులు మాడపాటి సరోజిని, కొమ్మూరి పద్మావతీదేవి, కొప్పరపు సరోజిని, అన్నపూర్ణమ్మ, వరదాబాయి మున్నగువారు రంగస్థలముపై వేషధారణచేసి అనన్యమైన కీర్తి ప్రతిష్ఠలనార్జించిరి.

ఆచార్యులవారి సదుద్దేశమును గమనించి కళాసేవకై ముందంజ వేయుటలో మహిళలు ఏమాత్రము వెనుకంజవేయరని నిరూపితమైనది. దేశమందలి ఇతరరాష్ట్రములలోకూడ మహిళలు ఉత్సాహముతో కళాసేవకై ముందుకు రాసాగిరి.

ఇట్టి అభ్యుదయ కార్యక్రమమును చేపట్టిన రాఘవను కళాభి మానులు మిక్కిలిగా ప్రశంసించిరి. నాట్యకళాభివృద్ధికై సేవచేయుట

కొరకు మహిళలకుకూడ అవకాశము కల్పించిన రాఘవను మహిళా సంఘములు అభినందించినవి. రాఘవ స్త్రీలకు తగిన శిక్షణను, ప్రోత్సాహమును అందజేయుచుండిరి.

యేబదేళ్ళ క్రితం రాఘవ సాగించిన ఉద్యమఫలితంగా నేడు నాటకరంగములు, చలనచిత్రములు, నటీమణులచే అత్యంత జయప్రదంగా సాగుచున్నవి.

1934 అక్టోబర్ 20,21 తేదీలలో బళ్ళారి మునిసిపల్ హైస్కూల్ లో జరిగిన, ధర్మవరం కృష్ణమాచార్య, కోలాచలం శ్రీనివాసరావుగార్ల, స్మారకోత్సవ సందర్భములో శ్రీరాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు చేసిన ఉపన్యాసములు "భారతి' మాసపత్రికలో ప్రచురింపబడినవి. రాళ్ళపల్లివారు "కళాదృష్టితో పరీక్షించితిమేని స్త్రీలు రంగమునకెక్కుటలో విశేషలాభమేమియు లేదని, నీతిదృష్టితో జూచినపుడు నష్టముగలదని పేర్కొనిరి. అభినయశక్తిగల వ్యక్తి పురుషుడైన పురుషపాత్రమునే స్త్రీయైన స్త్రీపాత్రమునే వహింపవలయునని నిర్బంధమేమి? పురుషులు స్త్రీపాత్రలను చక్కగా నిర్వహింపలేరనుట అనుభవవిరుద్ధమైన విషయము అన్నారు. మగవారు మగపాత్రము వహించి చూపు అభినయము కంటె ఆడవారి పురుష పాత్రాభినయము ఎందులోను తక్కువగా నుండదనుట నా అభిప్రాయము" అన్నారు. రాళ్ళపల్లివారి అభిప్రాయమును రాఘవ అనుభవముతో జతపరచి చూడండి.

కొన్నేళ్ళక్రితం ఆదవానిలో కొందరు మహిళలు ఒకనాటక సంఘమును నెలకొల్పి, బళ్ళారిలో 'రాజాభర్తృహరి' అను నాటకమును ప్రదర్శించిరి, నాటకములందలి పాత్రలన్నియు స్త్రీలచే అభినయింప బడినవి, ఆనాటకమును చూచియుండిన రాళ్ళపల్లివారు తమ అభిప్రాయమును తప్పకమార్చుకొని వుండెడివారని రాఘవ అభిప్రాయం.

కొందరు ప్రసిద్ధులైన నటీమణుల పురుషపాత్రాభినయమును చూచినారు. వారినటన పురుషస్వభావమునకు విపరీతముగా నుండుటయే కాక కళాదృష్టిలో అపకారము కల్గించునదిగా వుండెను.

ఇట్లే స్త్రీపాత్రలను ధరించిన పురుషులు వేషభూషణములలోను వలపు, ఒయ్యారములలోను స్త్రీలవలె అభినయింపవచ్చును. కానీ స్త్రీ సహజమైన హృదయము నెట్లు ప్రదర్శింపగలరు? ఈ వాదమును గూర్చి రాఘవ అభిప్రాయము ఈ రీతిగ నుండినది.

"పురుషుడు అభినయమున ఎంతటి అనుభవజ్ఞుడైనప్పటికి స్త్రీ పాత్రను అభినయింప జాలడు. స్త్రీ పాత్రధారణ ఆతని పురుషస్వరూపమును కప్పిపెట్టవచ్చును. కాని ఆజన్మసిద్ధమైన పురుషస్వభావమును మాత్రము ఆవేషము కప్పిపుచ్చజాలదు. మాతృప్రేమ, పతిప్రేమ ఈరెంటిని పురుషత్వము ప్రకటింపజాలదు." అనుభవ పూర్ణమైన రాఘవ గారి ఈ అభిప్రాయములను ప్రాజ్ఞులు కాదనలేరు.

అభినయమనగా కేవలము బాహ్యాడంబరముకాదు. వేష భూషణములతో మాత్రమే నాటకకళ పరిపూర్ణము కాజాలదు. కళా ప్రపూర్ణతకు అంతరంగ సాధన అవసరము. ఆయాపాత్రల సహజ గుణములను ప్రదర్శించుటలో సుసజ్జితమైన రంగభూమి ఏరీతిగా ముఖ్యమైనదో అట్లే హృదయావిర్భూతములగు భావపరంపరలను ప్రదర్శించుటలో ముఖము ప్రధానమగు రంగస్థలము. అట్లయిన కేవలము వేషభూషణములు స్త్రీత్వము ప్రకటింపజాలవు.

ప్రాచీనకాలమునుండియు మనవారు కళలను బాహ్యప్రదర్శనాల కొరకేగాక అంతరంగికమైన ఆధ్యాత్మికతను గుర్తించి కళ ఈశ్వర స్వరూపమని భావించిరి.

బాహ్యదృష్టికి 'కోకిల' కాకివలెనే కానవచ్చును. కాని, సహజ మధుర పంచమధ్వని ద్వారా ఇదికోకిలయని మనము గుర్తింతుము.

మనకన్నులు పురుషుని స్త్రీవేషముజూచి ఆశ్చర్యపడినను చెవులుమాత్రం అతని పురుషత్వమును బహిర్గతము చేయకుండనుండవు. చూచి మెచ్చుకొనుటయేకాదు విని ఆనందించుట కూడ నాటకప్రయోజనము. మానసికానందము మహత్తరమైనది. ఈ ఆనందమున మనం మైమరచిపోవుదుము. స్త్రీ వేషధారియైన పురుషుడు ఇట్టి మహదానందమును లభింపజేయగలడనుట సమంజసము కానేరదు.

ప్రతిభావంతుడైన నటుడు ప్రేక్షకులకు ఇట్టి తృప్తిని కలిగించగలడన్న. అది అతని సాహసమే కాని సహజత్వము కాదు.

ఈ సహజత్వమును విమర్శించుచు అనంతకృష్ణశర్మగారు 'ప్రకృతియందలి పదార్థములను' భావములను క్రియలను అనుకరించునదే నాట్యమని (అవస్థాన కృతిర్నాట్యం) అన్నారు. నాటకమనగా సహజం కాదు. కృత్రిమమంటూ "ఈ సహజత్వము స్త్రీ వేషమునకేనా వచ్చినది? ముసలివేషము వేసినవారిలో చర్మమునకు ముడుతలు జూపగల అభినేతయున్నాడా?" అని ప్రశ్నించిరి.

వారి వాదములో, సత్యాంశము లేకపోలేదుకాని సంపూర్ణ సత్యము కాదు. నాటకము సహజముకాదు. కాని అనుకరణము అన్నప్పుడు ఆ అనుకరణములో కూడ సహజత్వముండవలెనుకదా! యువకుడు అరువదేళ్ళ ముదుసలివలె నటించునపుడు ఆవేషమునకు తగినట్లు నెరిసిన వెంట్రుకలు, ముదిరిన ముఖము, తగ్గిపోయినధ్వని మున్నగు వాటిని చూపించవలెను కదా! ఇదియెట్లు సహజము కాగలదని భావించి ఆయువకుడు వున్నదున్నట్లే రంగస్థలమునకు వచ్చి ముదుసలి పాత్రకు చెందిన సంభాషణలను అప్పజెప్పినపుడు హాస్యాస్పదమగును కదా! యువకులైన రాఘవ వృద్ధవేషము ధరించి అత్యంత సహజముగా అభినయించు ఘట్టము ఇదివరకే వివరింపబడినది.

ఉత్తమనటులు ప్రతిభావంతులై ఆయాపాత్రలను అభినయించుట సహజము, కాని ఎంతఉత్తమనటుడైనప్పటికి స్త్రీపాత్రాభినయము మాత్రము సాధ్యమైనదికాదు. జాతిభేదము అతని ప్రతిభకు అడ్డు వచ్చును. అతడెంత ప్రయత్నించినను తనపురుష స్వభావలక్షణములను కప్పిపెట్టలేడు.

సృష్ట్యాదిగా ప్రాణులన్నిటిలో స్త్రీ పురుషభేదము వ్యక్తమగు చున్నది. కొన్ని జంతు పక్షులలో మనస్థూలదృష్టికి ఈ పుం, స్త్రీ భేదము కానరానప్పటికి వాటిధ్వనివలన ఆభేదము స్పష్టమగును. స్త్రీ సహజత్వమును పురుషుడు, పురుషునియొక్క సహజత్వమును స్త్రీ ఎన్నటికీ పొందజాలదు అన్నప్పుడు అభినయించుట మాత్రము ఎట్లు సాధ్యమగును?

కళ సహజమైనదికాదు అన్నంతమాత్రాన కృత్రిమతను పెంచ వలెనని ఏకళాకారుడూ సూచించడు.

నీతి తెరమరుగున మహిళాలోకములో సంస్కారణలు ప్రవేశ పెట్టుటకుకూడ శర్మగారు అడ్డుపడినారు. నాటకరంగములోని అవినీతిని వెదకునట్టి పండితులకు సమాజములో జరుగు అవినీతి కృత్యములు కానరాకుండుట విచిత్రముగ నున్నది. గుణావగుణములు సంఘములోని స్త్రీ పురుషులలో సమానముగా నుండును. అనుభవజ్ఞులైన పండితులు నాటకరంగములోనే అవినీతి యున్నదని ఆరోపించుట విచిత్రముగా నున్నది.

స్త్రీలు లేనిదే, వారిసహకారములేనిదే లోకవృత్తి లేదు. లోకవృత్తినే నాటకముగా ప్రదర్శించునపుడు స్త్రీల సహకారము లేకుండుట ఎంతవరకు సమంజసము? ప్రాచీన సంస్కృత నాటకముల కాలమునుండియు స్త్రీలు రంగభూమిపై పాత్రధారణ చేయుచున్నట్లు చరిత్ర తెలుపుచున్నది.

కాలక్రమమున స్త్రీలు రంగస్థలము ప్రవేశించుటను కొందరు సంప్రదాయ వాదులు నిషేధించిరి. కొందరి సంశయ ప్రవృత్తి గూడ ఇందుకు కారణమనవచ్చును. స్త్రీలనేకాదు, పురుషులను బహిష్కరించి సహపంక్తి భోజనమునకు అనర్హులన్న కాలమొకటి వుండినది. అవన్నియు వ్యక్తిగతములైనటువంటి భావములు. కాలక్రమమున ఎన్నోమార్పులు జరిగినట్లు స్పష్టమగుచున్నది.

## రాఘవ సినిమారంగము

కొందరు మిత్రుల ప్రోత్సాహముపై విస్తృతమైన చలనచిత్ర పరిశ్రమలద్వారా ప్రజలమనోవికాసాన్ని సాధింపవచ్చునన్న ఉద్దేశముతో రాఘవ సినిమారంగము ప్రవేశించిరి. 1935 నుండి 40 మధ్య ద్రౌపదీ మానసంరక్షణము, చండిక, రైతుబిడ్డ అనుచిత్రాలలో అభినయించిరి.

చలనచిత్రములలో అభినయించుట వారికంతగా రుచింపలేదు. నాటకరంగములో సహజ, స్వతంత్ర నటనచే యశస్సుగాంచిన రాఘవకు చలనచిత్రాలలోని కృతకమైననటన కళకాదని, నిరర్థకమని తోచినది. పండిత తారానాథ్ 'కన్నడసినిమా' అను పత్రికలో "రాఘవ నాట్యకళ" అనే వ్యాసములో "పెట్టుబడిదారు, డైరెక్టరు, ఛాయాచిత్ర గ్రాహకుడు" మున్నగువారి ముష్టిరంగమున ఆచార్యులవారి అభినయ వైశాల్యమునకు చాలినంత స్థలముండదు. సముద్రపుచేపకు సరస్సులోని ఈదులాటలో సుఖమెక్కడిది?" అనివ్రాసిరి,

రాఘవ అభినయ కౌశలమునకు సినిమారంగము తగినదికాదని తారానాథ్‌గారి అభిప్రాయము. మొదట్లో తమ మిత్రులైన కొందరు చలనచిత్ర దర్శకులకు నాటకకళపట్ల తమకుగల అభిప్రాయములను వివరించిరి. కాని వారి అభిప్రాయములు సినిమారంగమునకు సరిపడవని తెలిసికొని విస్మరించిరి. వరహావతారములను చూపించియో, వారిజాక్షుల అర్థనగ్ననృత్యములను చూపించియో, లేదా దేవతలకు భార్యపోరుల

కల్పించియో, పల్లెప్రజలను మభ్యపరచి పైకమును కొల్లగొట్టుటను ఆచార్యులు సహింపరైరి, ఈపని దేశద్రోహమని చాటిచెప్పిరి.

ప్రజలకు మనోవికాసముతోపాటు మనస్థయిర్యమును కల్గింపగల నాట్యకళ కేవలము ధనదాహముతో నిర్మింపబడుతున్న చలనచిత్రములు కీడు కలిగించునవిగా రాఘవ భావించిరి. సినిమా శ్రీమంతుల దృష్టిని ఉత్తమ కళాసేవకు మరలింప ప్రయత్నించి విఫలులైన ఆచార్యులవారు చలనచిత్ర రంగమునకు వీడ్కోలు చెప్పిరి.

## మరలా రంగభూమికి

సినిమారంగములో ఎవరినీ తృప్తిపరచలేక తన్నుతానుతృప్తి పరచుకోలేక పోవడంతో రాఘవ ఆరోగ్యము దెబ్బతిన్నది. ఆరోగ్యము కుదుటపడిన తరువాత 'ఆర్ట్‌లవర్స్‌లీగ్'' సభ్యులతోకలసి నవోత్సాహంతో నాటక ప్రదర్శనకు పూనుకొనిరి,

ఆంధ్ర కర్నాటక ప్రాంతములలోని పెక్కుపట్టణములలో అమెచూర్ సంఘముల సహకారముతో వారిలోకొందరు నటులను తమలో చేర్చుకొని ఉత్తమనాటకములను ప్రదర్శింపసాగిరి.

ప్రదర్శనకు యోగ్యమైన నాటకశాలలు లేకుండుట రాఘవ ప్రదర్శనములో స్పష్టముగా వ్యక్తమగుచుండెను. ఆయన అటు ప్రభుత్వమును, జిల్లాబోర్డు పురపాలక సంఘము మొదలగువాటిని అర్థించి విఫలులైరి. నటుల శిక్షణకై ప్రత్యేకముగా కేంద్రములను స్థాపించికాని లేదా కళాశాలలలోను పాఠశాలలలోను అభినయశిక్షణ పాఠ్యాంశముగా చేర్చవలెనని, నాట్యకళాకోవిదులను అధ్యాపకులుగా నియమింపజేసి విద్యార్థులకు నాటకకళలో శిక్షణ ఇవ్వవలెనని పాటుపడిరి. ఆర్థికదుస్థితికిలోనై వృద్ధాప్యములోనున్న నటీనటులకు తోడ్పడుటకై ఒక సహాయ నిధిని నెలకొల్పవలెనన్న అభిప్రాయమునువెలిబుచ్చిరి, నాటక సంఘములుకాని, నాట్యకళాభిమానులుగాని ఈ విషయమును అంతగా

పట్టించుకోలేదు. ఈ విషయమున నిరుత్సాహమునకులోనైన రాఘవ "మనదేశమందలి కళాకారులకు జీవితంలో సుఖంలేదు, అసుఖమేమైనా వున్నట్లయితే అది వారి మరణముతోనే" అని కన్నీరు కార్చిరి.

జాతీయ రంగభూమిని ఏర్పరచి నాటకకళాసేవ చేయవలెనన్న వారికోరికలు పగటికలలైనవి. అయినా ఆయన నవోత్సాహముతో కళారాధన చేయుటకు ముందంజ వేయుచుండిరి. కాని ఆయన ఆశించిన రీతిగా ఉత్తమ కళాభివృద్ధికి తగినంత ప్రోత్సాహము లభించక పోవుట వల్ల వారు ఎంతో విచారించిరి.

కళా ప్రేమీసంఘమున వారికి అత్యంత సన్నిహితులైనవారు. శ్రీయుతులు టి. కుమారస్వామి, నట్టంశ్యామారావు. బాదహట్టి శ్రీనివాసరావు, కరణం సీతారామారావు, చూడి వెంకోబరావు, లక్ష్మీనరసింగరావు. జోళదరాసి దొడ్డనగౌడ, వై. చంద్రయ్య ముఖ్యులు, వీరితోకలసి ఆచార్యులవారు అప్పుడప్పుడు ప్రదర్శనలిస్తుండేవారు. ఈ ప్రదర్శనలవల్ల ఆర్థికంగా నష్టము కలిగేది. అయినప్పటికీ న్యాయవాదిగా సంపాదించిన ధనమును నాటకములకే వెచ్చించుచూ కళాసేవ చేయుచుండెడివారు. వారిసహనటులు ప్రదర్శన విషయంలో వారితో ఎంతగానో సహకరించేవారు. కాని ఆర్థికమైన విషయాలలో వారు దూరంగా వుండేవారు. రాఘవ తన బృందములోని పేదనటీనటులకు నెలసరి వేతనము లిచ్చుచుండేవారు. వారిలో హార్మోనియం వాయించుటలో ప్రసిద్ధుడు టి. కుమారస్వామి. రాఘవతోకలసి పెక్కు సంవత్సరములు నాటక ప్రదర్శనములలో పాల్గొనెడివారు. నాటక ప్రదర్శనములేని నాటికి కుమారస్వామికి నెలసరి వేతనము ఇచ్చేవారు. కుమారస్వామి(కొమ్మి) రాఘవకు అత్యంత ఆప్తుడుగా వుండేవాడు, కవులు, పండితులంటే ఆయనకు అమితమైన గౌరవముండేది. తరచుగా వారు సంస్కృత నాటకముల గురించి, నాట్యశాస్త్ర విశేషముల గురించి

శ్రీయుతులు కొరటమద్ది వెంకటరామశాస్త్రి, రావాడ వెంకటరామశాస్త్రి, భాస్కరాచార్య, రామచంద్రస్వామి. వై. నాగేశశాస్త్రి మున్నగు విద్వాంసులతో చర్చించేవారు.

రాఘవ అంతరంగమును అర్థము చేసుకొన్నవారు కొందరు మాత్రమే. వారి బాహ్యప్రవృత్తిని విమర్శించినవారే ఎక్కువ. ముఖ్యముగా బళ్ళారిలో రాఘవ సౌజన్యమూర్తి. శత్రువులను సహితం గౌరవించేవారు. ఆయన దైవభక్తి కలవారు!

మాలదాసరి ఒకడు తన చరమదశలో రాఘవకు ఇచ్చిన ఏకనాదమును మీటుతూ ప్రతిదినము ఉదయమున పంచాక్షరీ మంత్ర భజన చేసేవారు. ప్రతిసోమవారం సాయంత్రము తమ మిత్రులతోపాటు భజనచేసేవారు. ఈ సాంప్రదాయము పండిత తారానాథ్ ఆదేశము మేరకు ప్రారంభమైనది. తారానాథ్ గారు రాఘవయొక్క ఆధ్యాత్మ గురువులేకాక సంగీతసాహిత్య నాటకవిషయములో తగుసూచనలనిచ్చు చుండేవారు. పండిత తారానాథ్‌గారి ప్రేమాయతనమను ఆశ్రమమునకు రాఘవ ఉదారముగా ఆర్థిక సహాయము చేసేవారు.

జారిన వయస్సులో రాఘవ జోళదరాసికి వెళ్ళి ఆగ్రామమందలి యువనటులను ప్రోత్సహించు చుండెడివారు. కనకదాస, 'క్రాంతి పురుష, బసవణ్ణ' నాటకముల రచనకు ప్రేరకులు రాఘవ. రాఘవ శిష్యులలో ప్రసిద్ధుడై అల్పాయుష్కుడై గతించిన గొప్పనటుడు చాకుబండతిప్పయ్య.

ఆంధ్రదేశములోని పెద్దపట్టణములన్నిటిలో రాఘవతోపాటు తిప్పయ్య పెక్కునాటకములలో పాల్గొనెడివాడు. రాఘవ తరచుగా అతని ప్రతిభావిశేషములను మిత్రులకు వినిపించేవారు. బళ్ళారిలో నాటక ప్రదర్శనశాల నొకటి స్థాపింపవలెనని వారికోరిక. దానికోసం ఆయన "రూపాయినిధి" ప్రారంభించెను. పురిటిలోనే సంధికొట్టినట్లు

ఆప్రయత్నము మొదట్లోనే పీగిపోయినది. రాఘవ జస్టిస్ పి. వి. రాజమన్నార్‌గారితో కలసివ్రాసిన 'తెగని సమస్య' అను నాటకమును ప్రదర్శించవలెనని మిక్కిలి ఉత్సాహముతో ప్రయత్నించిరి. ఎన్నోసార్లు ఈ నాటకము రిహార్సల్స్ పూర్తికావడం, ప్రదర్శన సమయానికి ఏదోఒక అంతరాయం కలగడం జరిగేది. ఒకవిధముగా 'తెగని సమస్య' పేరుకుతగినట్లుగా ఒక తెగనిసమస్య అయిపోయింది. ఏమైనాసరే తనజీవితకాలములో ఆనాటకమును ప్రదర్శించి తీరవలెనని ఆయనపట్టుదల. ఇదిఅయ్యేపని కాదని మిత్రులు అనగా రాఘవ "విధి అడ్డమొచ్చినా, నేనీ నాటకాన్ని ప్రదర్శిస్తాను. మీరుమాత్రం నాకు సంపూర్ణసహకారం అందివ్వండి" అన్నారు. నాటకాభ్యాసము చురుకుగా సాగింది. 23-3-46వ తేదీన నాటకప్రదర్శనమునకు సర్వసన్నాహాలు పూర్తయినవి. ప్రదర్శనము బళ్ళారిలోని "మ్యాక్ స్టేడియం"లో ఏర్పాటైనది. మద్రాసు హైకోర్టు ప్రధానన్యాయమూర్తి జస్టిస్ పి. వి. రాజమన్నార్ ప్రారంభోత్సవంతో ప్రదర్శన విజయవంతగా సాగింది. "ఇన్నాళ్ళకు నాచిరకాల వాంఛఈడేరినది" అంటూ అమితానందముతో తనసహచరులకు ధన్యవాదము లర్పించిరి. ఈ నాటక ప్రదర్శనముతో రాఘవ ఆశించినదంతా సాధింపగలిగానన్నట్లుగా సంతోషించిరి.

నాటక ప్రదర్శనము తరువాత పదిహేనురోజులకు రాఘవ ఆరోగ్యము దెబ్బతినింది. ఆయనకోలుకోవడం అసంభవమని అందరూ భావించిరి. వెక్కిళ్ళు, స్పృహతప్పడం సంభవించేది. ఆస్థితిలోకూడ రాఘవ తమ అనుచరులతో నాటకములనుగూర్చి ప్రస్తావించుచుండెడివారు. 1946వ సంవత్సరము ఏప్రిల్ 16వతేదీన పూర్ణిమ. హంపీక్షేత్రములో

విరూపాక్షేశ్వరుని రథోత్సవదినము, ఆరాత్రి 11 గంటలకు రాఘవ జీవితనాటకరంగమునుంచి నిష్క్రమించిరి.

మహాత్ముల వ్యక్తిత్వ వైశిష్ట్యము వారి మరణములో కానవచ్చునట్లు రాఘవ తమచివరి ఘడియలో శివపంచాక్షరిని జపించుచూ నటరాజు సన్నిధిని చేరుకొన్నారు.

——o——

# రాఘవ సమయ స్ఫూర్తి

రాఘవ సమయస్ఫూర్తి అద్భుతమైనది. ఒకమారు విజయవాడ లోని దుర్గకళామందిరంలో 'చంద్రగుప్త' నాటకప్రదర్శనము జరిగింది. శ్రీస్థానం నరసింహారావుగారు 'మురి' పాత్రధారి. విజయవాడ ప్రేక్షకులకు అదొక పర్వదినము. ప్రేక్షకులు తన్మయులై నాటకం చూస్తున్నారు. సోదర వాత్సల్యప్రేరితుడై చంద్రగుప్తుడు నందులతో పోరుసల్పనన్నాడు. నందవంశ నిర్మూలనంతోకాని తనదుఃఖం తీరదని 'మురి' తనయుణ్ణి పురిగొల్పుతుంది, నందులుచేసిన అవమానాలకు ప్రతీకారం జరిగి తీరవలసిందే అని చాణుక్యుడు చంద్రగుప్తుని ప్రేరేపింతురు. చాణుక్యుడు చంద్రగుప్తుని ఆశీర్వదించి సమరభూమికి పంపేఘట్టమది, తన జోలియలోని కుంకుమ బరిణెకై చేయిపెట్టగా అదికనిపించలేదు. వెంటనే తననొసటి కుంకుమనే తీసి చంద్రగుప్తుని నుదురున తీర్చి ఆశీర్వదించే సన్నివేశాన్ని తిలకించిన ప్రేక్షకుల హర్షధ్వానాలతో కళామందిరం మారుమ్రోగింది, రాఘవ సమయ స్ఫూర్తికి ముగ్ధుడైన దొడ్డనగౌడగారు "అయ్యా! బరిణె కానరాక పోయేటప్పటికి మీనొసటి కుంకుమ పెట్టవలెనన్న విషయం ఎట్లు స్ఫురించింది?" అనిప్రశ్నింపగా అంతాశివానుగ్రహంఅన్నారు,

మరోఘట్టం. ఒకరోజు రాఘవ చంద్రగుప్త నాటకంలో చాణక్యవేషం ధరించిరి. నందునిసభలో తనకుజరిగిన పరాభవానలంతో దందహ్యమానులై ప్రళయకాల రుద్రునివలె నటించే ఘట్టములో అకస్మాత్తుగ ఒకకుక్క రంగస్థలంమీదికి వచ్చినది. సామాన్యనటులు అసందర్భములో అభినయము చాలించి కుక్కను తరమమని సంజ్ఞలు చేసేవారు. రాఘవ ఏమాత్రము తడబడక కుక్క నుద్దేశించి "ఓశునక రాజమా! నీకుకూడా నేను లోకువయ్యానా?" అని సంబోధించేసరికి ప్రేక్షకులు సంభ్రమాశ్చర్యములతో హర్షధ్వానములుచేసిరి.

ఒకసారి పిఠాపురంలో 'రామదాసు' నాటకప్రదర్శన జరిగింది. రాఘవ రామదాసు. దొడ్డన గౌడ కబీరు. గౌడగారికి ఆకస్మికంగా కడుపునొప్పి ప్రారంభమైనది. రంగస్థల ప్రవేశం చేసేసమయానికి గౌడగారికి తీవ్రమైనవేదన కల్గింది. కబీరు పాత్రధరించే వారెవరూ లేరు. ప్రథమాంకములో భద్రాద్రికి వెళ్ళేయాత్రికుల బృందం దృశ్యం ముగించి రాఘవ లోపలికి వెళ్ళినారు. గౌడగారు "అయ్యా! నేనీ బాధ భరింపలేకున్నాను. ఏమిచేయమంటారు?" అంటూకన్నీరు కార్చసాగినారు. రాఘవ "గౌడ! భయపడవద్దు. శివునిధ్యానించు" అంటూవెన్నునిమిరిరి. అంతే. గౌడ 'కహోరామ్' అంటూ పాటపాడుతూ రంగప్రవేశం చేసినారు. నాటకం అత్యంత జయప్రదంగా సాగింది. ఆనటరాజు జీవితంలో ఇట్టి అద్భుత సన్నివేశాలు అసంఖ్యాకములు.

రాఘవ చతురవచోనిధి. ఒకసారి హిందూపురంలో రామదాసు నాటకప్రదర్శనం ముగించి వసతి గృహము చేరునప్పటికి పెట్టెలలోని కొన్నిచీరలు, పైకము దొంగలింపబడి ఉన్నవి. తన విలువైనచీరలు పోయినందుకు పద్మావతిగారు దుఃఖింపసాగినారు. రాఘవ సహజమైన చిరునవ్వుతో, ఎందుకమ్మా! అలాఏడుస్తావు? ఆదొంగ పేదవాడై ఉంటాడు. భార్య పోరుపడలేక మంచిచీరలను ఎత్తుకొని పోయినాడు, పోనీలే! రేపే కొత్త చీరలు కొంటేసరి" అన్నారు. తోటినటులైన గౌడగారు "అయ్యా! ఏమేమిపోయినవి? అనిప్రశ్నింపగా," ఏమిపోయినా చింతలేదు, వెధవ, తనకు కావలసినవి మాత్రమే దొంగిలించినాడు. పోయేముందు వస్తువులను సర్దుబాటుచేసి వెళ్ళివుంటే వాడి అబ్బసొమ్ము ఏం పోయేది? అదో, ఆసిగార్ అక్కడేవుంది, ఆగూట్లోని బ్రాందీసీసా అట్లేవుంది. ఆడబ్బాలోని లడ్డుమాత్రం ముగించినాడు. వాడెవడో పనికిరానివెధవ" అంటూ నవ్వడంతో బృందంలోని వారందరూ నవ్వినారు, పద్మావతిగారి కోపం మాత్రం ఇంకాతగ్గలేదు. "ఏమండీ మీ ఎగతాళికి వేళాపాళా లేదేమండి"? అన్నారు. రాఘవ నవ్వుతూ

పోయినవస్తువుకై ఏడ్వడం కంటె నవ్వడం మంచిదికాదా! ఆదొంగ తస్కరింపక మిగిల్చిననవ్వును మనంగా వ్యర్థ్యం చేసుకోవటం మాత్రం నిష్ప్రయోజనం'' అన్నారు. అదీ ఆయన మనోప్రవృత్తి.

జీవితంలోను, నటనలోను ఆయనకాయనేసాటి. లండన్‌లో షైలాక్ పాత్రాభినయమును చూచిన జార్జ్ బెర్నార్డ్‌షా ''అయ్యో! షేక్స్ రచిస్తే నీవునటించినావు. నీవు భారతదేశములో జన్మించడమే తప్పు. నీవుఇక్కడే పుట్టివుంటే ఇంగ్లాండు నిన్ను షేక్స్ పియర్ అంత గొప్పవాణ్ణిచేసి వుండేది'' అన్నాడు.

ఒకమారు ప్రసిద్దరంగస్థల నటులైన డి. వి. సుబ్బారావుగారికి బందరులో గజారోహణ సత్కారం ఏర్పాటు చేశారు. ఆ ఉత్సవానికి రాఘవను ఆహ్వానించారు. సుబ్బారావుగారి అభినయంపట్ల రాఘవకు అభిప్రాయ భేదాలుండేవి. కాని, వుదారహృదయుడైన రాఘవ ఆహ్వానాన్ని మన్నించి బందరు వెళ్ళాడు. నేరుగా సుబ్బారావుగారి యింటికి వెళ్ళాడు. సుబ్బారావుగారి గృహద్వారము అంతఎత్తైనది కాకపోవడంతో రాఘవ తలవంచి యింటిలోకి వెళ్ళి సుబ్బారావుగారిని అభినందిస్తూ ''సుబ్బారావ్ నేనిదివరకెవరికీ తలవంచలేదు. ఇప్పుడు తలవంచవలసివచ్చింది''అంటూనవ్వుతూ సుబ్బారావును అభినందించారు. 'మీకు సన్మానం జరగడం నాకెంతో సంతోషం' అన్నారు రాఘవ. సుబ్బారావుగారు ఆనందబాష్పాలు రాలుస్తూ రాఘవను అమాంతంగా కౌగలించుకున్నారు. ఈ విషయాన్ని ప్రముఖ పాత్రికేయులు రావూరు వేంకట సత్యనారాయణగారు పేర్కొన్నారు.

——0——

# రాఘవ నాటక రచన

నాటకం సమాజాభ్యున్నతికి సాధనం కావలెనని రాఘవ ఆశించాడు. ఆయన రచించిన నాటకం 'సరిపడని సంగతులు' మూడం కాలు గల ఈ నాటకం ఆంగ్లనాటక పద్ధతిలో నాందీప్రస్తావనాదులు లేకుండాసాగింది. విధవావివాహానికి సంబంధించినది ఇందలి ఇతివృత్తం.

భీమసేనరావు ప్రముఖన్యాయవాది. సదాచార సంపన్నుడు. ఆయన మేనకోడలు తార. చిన్నతనంలోనే తల్లితండ్రులను పోగొట్టు కొన్నతార మేనమామ భీమసేనరావుగారి ఆశ్రయంలో పెరుగుతుంది. రావుగారు ఆ అమ్మాయిని అరవైఏళ్ళ ముసలివానికిచ్చి పెళ్ళిచేస్తారు. కొంతకాలానికి తారకు వైధవ్యం ప్రాప్తిస్తుంది, మతాధికారి విద్యాలంకా రాచార్యులుగారికి పైకము ముట్టచెప్పి విధవయైన తారకు కేశఖండనము అవసరంలేకుండా చేస్తాడు భీమసేనరావు.

భీమసేనరావు కుమారుడు రాజా, తార ప్రేమించుకోవటంతో ఆమె గర్భవతి అవుతుంది. మేనమామ తారను గర్భస్రావం చేయించు కోమని రహస్యంగా బలవంతపెడతాడు. తార అంగీకరించదు. రాజా ఆమెను పెళ్ళిచేసుకోడానికి జంకుతాడు.

తార ఆత్మహత్య చేసుకొనే ప్రయత్నంలోవున్నపుడు భీమసేన రావుగారి గుమాస్తా శ్రీధర్‌శాస్త్రి ఆమెను కాపాడి తన యింటిలో ఆమెకు ఆశ్రయమిస్తాడు. ఈ విషయం తెలిసిన భీమసేనరావు శ్రీధర శాస్త్రిని వుద్యోగంనుండి తొలగిస్తాడు. తారను రాజామొకటిగా చేయాలని శ్రీధర్‌శాస్త్రి వుద్దేశం. శ్రీధరశాస్త్రి జీవికకోసం వీరన్నశెట్టి దుకాణంలో గుమాస్తాగా చేరుతాడు, శెట్టిదుకాణంలోని చంద్రహారాన్ని శ్రీధరశాస్త్రి

దొంగలించాడనే కేసు బనాయించి భీమసేనరావు శ్రీధరశాస్త్రిని అరెస్టు చేయిస్తాడు. న్యాయస్థానంలో భీమసేనరావుగారి భార్య లీలావతి, కుమారుడు రాజా, శ్రీధరశాస్త్రియొక్క నిర్దోషిత్వాన్ని న్యాయస్థానంలో వెల్లడిస్తాడు. భీమసేనరావే నేరస్థుడవుతాడు. చివరకు తార రాజాల వివాహానికి భీమసేనరావు అంగీకరించడంతో కేసు వుపసంహరించుకోవడం; తార రాజాల పెళ్ళికావడం జరుగుతుంది.

రాఘవ నాటకరచనలో సిద్ధహస్తుడుకాడు. మొదలి నాగభూషణం శర్మగారన్నట్లు 'సరిపడని సంగతులు' గొప్పనాటకం కాకపోయినా గొప్పనటుడు వ్రాసిన నాటకంగా తప్పకుండా మిగులుతుంది.

——o——

# అభినయకళ

నటకులంటే గౌరవాదరణలు మృగ్యంగా వున్న ఆరోజుల్లో సుబ్బారావుగారికి ఈ గౌరవం ఏర్పాటు చేయబడినదంటే నా ఆనందం చెప్పనలవికాదు. ఆంధ్రలోకానికి ఈరూపేణా అభినయకళయెడ కలిగిన అభిమానాన్ని అవకాశంగా తీసికొని తత్కళాధిదేవత ఆరాధన మందిరానికి ఈ తరుణంలో పునాదులు పడేటట్టు చేయవచ్చుననే ఆశతో అడుగుటయె తడవుగా ఆప్యాయంగా అంగీకరించానీ సభా అధ్యక్షతను నిర్వహించడానికి.

ముఖప్రీతి మాటలు మాట్లాడడం నాచేతకాదు. నాకుతోచిన అభిప్రాయమేమిటో చెప్పివేయ నిశ్చయించుకున్నా నీవేళ. ఇన్నాళ్ళూ నేనూ ఒకవేషంకట్టి స్టేజి ఎక్కుతున్నందువల్ల, ఏమాట నోరుజారితే ఎవరేమనుకొని పోతారో అనే సంకోచం, కాద్దోగాపోవ్పే పట్టుకొనిపీడిస్తూ వుండేదిదివరకు. ఇప్పుడా సంకోచంకూడా పోయింది. వేషాలు

వెయ్యడం ఇక మానివేయ నిశ్చయించుకున్నాను. నాకిక ఒకరిని చూచి వెరవవలసిన పని ఏమున్నది?

ఆంధ్రదేశంలో నేను అనేక నాటక సమాజాలు చూచాను. సుబ్బారావుగారి నాటక సమాజంలాంటి కట్టుబాటుగల నాటకసమాజాన్ని మరెక్కడా చూడలేదు. సుబ్బారావుగారిని ఇందుకు ఎంతైనా మెచ్చుకోవలసి వుంది. అదీగాక నాటకంలో తోటినటుల అభినయాన్ని తాను మింగి తన దర్జాయే వెలిగించుకోకుండా అందరికీకూడా కావలసినంత అభినయావకాశం కల్పిస్తూండడం సుబ్బారావులోని విశిష్ట లక్షణంగా నాకు గోచరించినది. చాలామంది పెద్ద నటకుల్లోనే యిది కేవలం మృగ్యంగా వుంటూంది.

ఇది సినిమాయుగమండి. సినిమాతారలయుగం. సినిమాతారలు కుప్ప తిప్పలుగా వుద్భవిల్లుతున్నారు. ఈరోజుల్లో రసికతాదారిద్ర్యము, అర్థసంపాదనేచ్ఛ ఇవే లోకంలో తారలను పుట్టించి వదుల్తూ వున్నాయన్నాడొక విఖ్యాత పాశ్చాత్య విమర్శకాగ్రేసరు డిటీవల. తారలు భూమిమీద పడితే భూమికెంత వుపద్రవమో చెప్పలేముకదా! అభినయ కళ ఇప్పుడెట్టి వుపద్రవ స్థితిలో వున్నదో తలచుకుంటే నా గుండె తరుక్కుపోతున్నది.

"నడిపించుట" అని అర్థమిచ్చే "నీ" ధాతువు నుండి పుట్టినది అభినయపదం "అభి" అనేది వుపసర్గ. అభినయంచేసే వాడంటే కేవలం కన్నుతిప్పేవాడు, చెయ్యి తిప్పేవాడు కాదు. ఎవడైతే నడిపించగలడో వాడే అభినేత. నడిపించేదెవరిని? మానవ సంఘాన్ని. మానవ సమాజాన్ని. మానవ సమాజంలో వుద్బోధ కలుగజెయ్యాలంటే నాటక కళను మించిన సాధనం మరొకటిలేదు. కాని మన అభినయం ఇప్పుడు సమాజాన్ని ఎక్కడికి నడిపించుకొని తీసుకపోగల్గుతోంది?

అభినయమంటే చిత్తవృత్తులను స్వాధీనంలో వుంచుకొని వాటి వాటి హద్దులు మీరకుండా నడవడమేకాని మరియొకటికాదు. మనసు ఒకతోలు తిత్తి వంటిది. కామక్రోధ లోభమోహ మదమాత్సర్యాలనే ఆరు గొట్టాలున్నాయి. దానికి ఒక్కొక్క గుణం వుద్రేకించినపుడు ఒక్కొక్క గొట్టం గాలి ఎక్కువగా పోసుకొని మోగుతూ వుంటుంది. గాలి ఇట్లా బెసగకుండా తిత్తిలోపలనే సమస్థాయిలో వుంచుకొనడం అవసరం ప్రతివారికీ. కామక్రోధాదులను మొదలంట నాశనంచేయడం ఎవరికీ సాధ్యంకాదు. మన తత్వశాస్త్రం దాన్ని ఒప్పుదుకూడా. వాటిని అతిక్రమించమని వుద్బోధ చేస్తుందది ఎంత సేపూ. ఆ అతిక్రమించడమే యోగం. అదే అభినయ లక్ష్యం. "యోగః కర్మసుకౌశలం" అన్నది భగవద్గీత.

అభినయమంటే ఏవో కొన్నికొన్ని చేష్టలను అనుకరించడం మాత్రమేనని చాలమంది అర్థంచేసుకుంటున్నట్లు కనిపిస్తోంది. నిజమైన అభినయం అదికాదు. మనం చూచేది సాధారణంగా actoring అనుకరణంగాని acting అభినయంకాదని అన్నాడొక పాశ్చాత్య రసిక శేఖరుడు. సాంఘిక నాటకాలలో అభినయం ఒక రకం. పౌరాణిక నాటకాల్లో అభినయం వేరొక రకం. సాంఘిక నాటక పాత్రల అభినయానికి పరిశీలనాశక్తి కావాలి. పౌరాణిక నాటక పాత్రల అభినయం కేవలం మన భావనాశక్తి మీద ఆధారపడి వుంటుంది. ఈ రెంటినీ యథోచితంగా కల్గి అభినయించేవారు ఈ రోజుల్లో ఎంతమంది వున్నారో పరిశీలించండి మీకే తెలుస్తుంది.

హరిశ్చంద్రవేషంవేశాడంటే ఆపుస్తకంలో వుండే సంభాషణలను ఏదోవిధంగా వర్ణించివేసి ఆయాపద్యాలను సంగీతంతో పూరించి వెయ్యడంతో పూర్తికాదుపని. తానే హరిశ్చంద్రుడుగా ఏకాగ్రదీక్ష వహించాలి నటకుడు. పుస్తకములోవున్న మాటల్ని ఎలా అంటాడనేది

కాదు, అందులోలేని ఇతర సందర్భములలో అతడెలా ప్రవర్తిస్తాడనేది కూడా నటకుడూహించాలి. భార్యయింట్లో వంటచెయ్యక శరిస్తే హరిశ్చంద్రుడేమిచేస్తాడు. ఎలా ప్రవర్తిస్తాడనేది వూహించగలిగి వుండాలి నటకుడు, నెలల తరబడిగా ఇలా ఒక్కొక్క పాత్రయందు ఏకాగ్రతపూనితేగాని నటకుడాపాత్రను నిర్వహించడానికి పనికిరాడని నా అభిప్రాయం, ఏదీ. ఎంతమంది వున్నారు అలాచేసేవారు?

నేను ఒకసారి శివాజీపాత్ర ధరించి రామకృష్ణ మతానికి చెందిన స్వాములవారిని చూడమని ఆహ్వానించాను. ఆయన చూచినతరువాత మరునాడు నాతో శివాజీ అభినయం ఏమీ బాగులేదు పొమ్మన్నాడు. ఏమన్నాను? శివాజీ మాటలపోగుకాదు. కార్యశూరుడు, యోధుడు. శివాజీని నీవు నీచేతల్లో ప్రత్యక్షం చేయవలసివుంది ప్రేక్షక జనానికి. కాని ఇదేమిటి. చేతులు అలా జాడిస్తూ నడిచావు. రణతంత్ర శిక్షితుడైన క్షత్రియునికి ఎడమచెయ్యి కదలదు. నీవు చేతులు తిప్పడం శుద్ధవైదీకి త్రిప్పినట్లుగావుంది అన్నాడు. తెల్లబోయానునేను.

అభినయానికి ఎంత తపస్సు అవసరమో, ఎంతశిక్షణ ఆవశ్యకమో దీనివల్ల తెలుస్తూనేవుంది. అభినయ శిక్షణాలయాలు స్థాపించడం అవసరమని నేనందుకనే ఇంతగోల పెట్టడం. పాశ్చాత్యదేశాల్లో ఇట్టి శిక్షణాలయాలున్నాయి. ఒకశిక్షణాలయంలో నేను ప్రత్యక్షంగాచూచాను. అక్కడ ప్రాథమిక శిక్షణఏమిటో తెలుసునా? గుర్రపుస్వారి, ఈత, కత్తిసాము మొదలగు వ్యాయామకళల్లో ఆరితేరాలి శిక్షితుడు ముందు. క్రమంగా మానసిక తత్వ రహస్యాలు బోధించడం వరకూ వున్నాయి ఈ తరగతులు,

ఇంగ్లాండ్‌లో 'కింగ్‌లియర్' నాటకం రిహార్సలు చూచానోసారి. కింగ్‌లియర్ పాత్రధారి తన పాత్రను అభినయించడంలో స్టేజిమీద

ఎన్నిఅడుగులువేసి ఏముక్క చెప్పాలో అంతా ఒకలెక్కగా నిర్ణయించ బడివుంది. నేను వెంటనే ఇది అభినయంకాదని వాళ్ళ మొహాన్నే అనేశాను, అభినేతకు అప్పటి చిత్తసమాధి ననుసరించి ఇష్టమువచ్చిన అభినయసృష్టి చేయడానికి స్వేచ్ఛవుండాలి కాని అర్థంలేని ఈ సంకెళ్లు తగిలించడమేమిటి? తాను ధరించబోయే పాత్రను అభినేత తన హృదయంలో భావించుకోవడమనేదే అభినయ కళాశాలలో మనం యివ్వవలసిన శిక్షణ. తక్కిన వివరాలన్నీ అతని యిష్టానికి వదలి వేస్తాము.

నాటక శిక్షణాలయాలు మనం స్థాపించడమంటూ వస్తే, పాశ్చాత్యులకంటేగూడ ఎక్కువ విజ్ఞానంతో స్థాపించగలం. భారతీయు లకు విజ్ఞానం ఎప్పుడూ లోపించలేదు. బెర్నార్డ్‌షా అంతవాడు నాతో "సాంఘిక, నైతిక, నాగరిక, ఆధ్యాత్మిక విషయాల్లో నేర్చుకోవడానికి పాశ్చాత్యదేశాలు భారతదేశంవద్దకు రావలసివున్నదిగాని, భారతదేశం పాశ్చాత్య దేశాలవద్దకు పోవలసిన పనిలేద"ని అన్నాడు.

నాటకశాల ఏ పద్ధతులలో వుండవలసినదీ ఆంధ్ర యూనివర్శిటీ వారి కోరికమీద ఒక "సినాప్సిస్" వ్రాసిపంపాను మూడు సంవత్సరాల క్రిందట. అందులో అభినేత కుండవలసిన ప్రాథమికార్హత ఏమని నిర్ణయించానో తెలుసునా? భారత, భాగవత, రామాయణాలను సమగ్రంగా అభ్యసించనివానిని విద్యార్థిగా తీసికోకూడదు అని మొట్ట మొదటి నియమం. యూనివర్శిటీ వాళ్ళింకా ఆలోచిస్తున్నారులెండి___ మూడు సంవత్సరాలేగా యిప్పటికయింది! దీనికి లిమిటేషన్ దోషంలేదు.

యూనివర్శిటీవాళ్ళు చేయాలని, గవర్నమెంటువాళ్ళు చెయ్యాలని మనం కనిపెట్టుకొని కూర్చుంటే జరిగేపనులు కావివి. మనమే ఏదో

కొంత ప్రారంభం చేయాలి. సుబ్బారావుగారిమీద అందునిమిత్తం కొంతసొమ్ము ఒక నిధిగా ముందుచేరిస్తే దానిమీద మునిసిపాలిటీల ద్వారానో, ఇతర పెద్దలను పట్టుకునో, దాన్నిపెంచి ఏ పదిహేనువేలో చేసి కొద్ది యెత్తులోనే ఒక ఆదర్శనాటకశాలగా నిర్మించవచ్చు.

నాకు ఇంకొక ఆశయంకూడా వుంది. జిల్లాబోర్డులద్వారా కొంతమంది వుత్తమ కవులచే కొత్త ఆదర్శనాటకాలు వ్రాయించి, కొంతమంది వుత్తమనటులచే వాటిని ప్రాక్టీసు చేయించి గ్రామగ్రామం సంచార నాటకక్రమం నడిపించాలని. మన జానపదుల రక్తంలో ఆధ్యాత్మిక తత్వం జీర్ణించి వున్నది కాబట్టి మొదట్లో పౌరాణిక నాటకాలే వుండడము అవసరం. కాని వాటిని పాతపక్కీని కాకుండా క్రొత్త ఫక్కీని వ్రాయించవలసివుంది. పురాణాలకు క్రొత్త వ్యాఖ్యానాలు యివ్వాలి. ఈ క్రొత్త నాటకాలు సమాజాన్ని చైతన్యవంతంగా చేసేనాటకాలు కావాలని. విషయాలసత్వంలో పడవేసే ప్రేమ నాటకాలు మనకు వద్దు. ప్రేమ! ప్రేమ! ప్రేమ! ఎందుకు వచ్చినప్రేమ యిది! విప్రనారాయణ, సారంగధర, చింతామణి, శాకుంతలం, మన కిప్పుడు ఎందుకు వుపయోగపడే నాటకాలివి? పౌరాణిక నాటకాలైనా ప్రస్తుత కాలానికి పనికివచ్చే క్రొత్తదారులు తీసే నాటకాలు కావాలి మనకు.

ఇలా అన్నందువల్ల శృంగారరసాన్ని నిషేధిస్తున్నానని భావించకండి. శృగారరసం లేనిదే నాటకానికి పుష్టేవుండదు. కాని, ఆ శృంగారం పచ్చిపోకడలు పోకుండా హద్దుల్లో వుండాలని మాత్రమే నేననేది. నాట్యకళాసేవకు నా హృదయం క్రేక్షరుకుతుంది. అవకాశం దొరికితే ఈ న్యాయవాద వృత్తిని తన్నివేసి ఈ సేవకై నాజీవితాన్ని అంకితం చెయ్యాలని వుంది. ఆంధ్రమహాజనులారా ఏమి ఆజ్ఞ?

———o———

# ఆంధ్ర నాటక కళా పరిషత్తు

## అధ్యక్షోపన్యాసము



ఇది నాకొక దుర్భరమగు శ్రమ. ఇట్టివి నాకిదివరకు రెండుసార్లు తటస్థించినవి. ఇదిమూడవది. ఇదేకడపటిదనికూడా నేనాశించుచున్నాను. ఇట్టి అవసరములలో సత్యములు కావని తెలిసిన విషయములనే సభ్యులకు ఆమోదకరమగు రీతిని నాబోటివారు చెప్పవలెనని సభ్యులాశించుట వాడుకయైయున్నది. ఇది మిక్కిలి కష్టమగు సమస్య. ఏదోయొక విషయమును చెప్పవలెనను బలమగు ప్రేరణ అంతరాత్మ నుండి కలిగిననేకాని ఎవ్వడును ఏమియు చెప్పగూడదనే నా అభిప్రాయము.

నాటకరంగము నాట్యకళనుగూర్చి నేను చెప్పదలచిన కొద్ది విషయములను నేనిదివరకే బహిరంగసభలలో చాలాసార్లు తెలిపియున్నాను. నాకు దీనినిగూర్చి తెలిసినది చాలా స్వల్పము. మొదట నేను వినోదార్థమే నాటకరంగమున అడుగిడితిని. ఆవలన నాకు నాటకరంగంలో యథాశక్తి పాల్గొనవలెనను ప్రబోధము గాఢతమముగా కలిగినది. నేనుద్దేశించినది మన చిన్న నాటకరంగముకాని, జగన్నాటక సూత్రధారునిచే ఆడింపబడుచున్న విశ్వనాటక రంగముకాదు. ఆత్మోపలబ్ధికి నాటకరంగము నుపయోగించుట కవకాశము కలదని నేనావల తెలుసుకొంటిని. ఒకడు మనశ్శాంతిని బడయుటకు నాటకప్రదర్శనములు ముఖ్య సహాయకములను విషయము కూడ నాకిపుడనుభవమునకు వచ్చినది. లాభకరము యథార్థమునగు పనిని జరుపుటకు నాటకరంగము నుపయోగించవచ్చునను నమ్మకము నాకు కలిగియుండనిచో ఈ 28

సంవత్సరములనుండి ప్రతిదినమును నేను వ్యయపరుచుచుండిన రీతి సాధనమును నా కాలమును వ్యయపరచి యుండను. నాటక కళాభివృద్ధి గూర్చి యిప్పుడు జరుగుచున్నపనికంటె ప్రగల్భములే ఎక్కువగా వున్నవనియే నేను నమ్ముచున్నాను. సంతాపకరమగు ఈ నమ్మకము నాకిపుడు మరింత అధికమైనదని తెలుపవలసివచ్చినందులకు నేను చాల చింతించుచున్నాను.

భారత నాటక రంగమందుగాని, దాక్షిణాత్య నాటక కళయందుగాని నిజమగు అభివృద్ధి యేమియును కలుగలేదు. నాకు 28 యేండ్లు స్వల్ప కాలము కాదుకాని ప్రథమ గణ్యమగు నాటకశాలను నిర్మించుటకు తగిన స్థలమిప్పటి వరకును నాకెచటగూడ కన్పింపలేదు. ఆంధ్ర నాటకములలో నాటకనామము సార్థక పరుపదగిన నాటకములు ఐదారు కంటె హెచ్చుగా కనబడవు. ఈపనిలోనాకు పెక్కు వందలమంది తోడ్పడిరి కాని, వీరిలో చిత్రలేఖనమును అభ్యసించినవారు, దాని విషయమున శ్రద్ధబూనినవారు ఇద్దరు, ముగ్గురు మాత్రమే కనబడిరి. ప్రకృతిసహజముగా రంగస్థలమును ఆయాసందర్భముల కనుగుణముగా నమర్చురీతిని సరిగా నూహింపగల నాటక సమాజము నాటకములను జీవనాధారముగా చేసికొనిన సంఘములలోను కళాభిమానముచే ప్రదర్శనములను జరుపుచున్న సంఘములలోకూడ నాకింతవరకు ఒకటియైన కనబడలేదని నేను రూఢిగా చెప్పగలను. సరియైనరీతిని కృత్రిమ శిరోజాలంకారములను సిద్ధపరచు పద్ధతిని తెలిసికొనిన వారొక్కరుకూడా నాకు కనబడలేదు. రంగస్థలమునందును, ప్రేక్షకు లుండు స్థలమునందును ప్రకాశమెట్లుండవలెనను విషయమునుగూడ నే సంఘమువారును సరిగా తెలిసికొనియుండలేదు. 28 ఏండ్లక్రిందనున్న స్థితిలో ఇపుడు గమనింపదగిన అభివృద్ధిఏమియు కనబడుటలేదు. అనుకూలమైనమార్పు లేశమైనను కనబడుటలేదు. 1885 వ సంవత్సరం

నందు వెనుకటి మోటుతనపు వీధినాటకముల పద్ధతిని విరమించి నవీన నాటక రంగములను నిర్మించిరి. అప్పుడు మాత్రమే నిజమైనమార్పు కలిగినది. అందువలన క్రమక్రమముగా అభివృద్ధి కలుగగలదనియు ఆశించుట కవకాశమేర్పడినది. ఇరువదేండ్లక్రితం నటులును, ప్రేక్షకులునుగూడ తెలుగులో సంవాదరూపమగు వచనమునందు నాటకములను ప్రదర్శించుటలోగల ప్రాముఖ్యమును బాగుగా గ్రహించి యుండిరి. నాటక ప్రదర్శనములలో గానమునకెట్టి ప్రాముఖ్యమును గూడ నియ్యకుండుటకు వారు మనఃపూర్వకముగా ప్రయత్నించి కృతార్థులైరి, కాని యిపుడు సంగీతము నాటకరంగమును పూర్తిగా వశపరచుకొన్నది. పదేండ్లక్రితం సంగీతము ఎట్టిసంగీతము? అధమాధమమగు సంగీతముగాని శ్రోతృజనుల నానందాబ్ధి నోలలాడింప గల శ్రేష్టతమమగు శాస్త్రీయగానముకాదు. అట్టి నికృష్ట సంగీతము నాటకరాజ్యంపై దాడి ప్రారంభించెను. అప్పటినుండి యీ మార్పు ప్రారంభమై దినదినాభివృద్ధి నొందుచున్నది.

నాటకరంగము 18 ఏండ్లక్రితంకంటె ఇపుడుచాలా అధ్వాన్నముగా నున్నది. ఇపుడు మరియొక మార్పుకూడా తలచూపినది. ఇది నటులకు బిరుదముల నంటగట్టుట. ఔపకారిక ప్రదర్శనముల జరుపుట మూడవ మార్పు. ఏదోఒక ప్రజోపకార సంస్థయొక్క సహాయార్థమైన నాటకరంగమును ప్రదర్శించు మిషమీద కొందరు నటులు ప్రేక్షకులుకూడా నాటక కళను హతమొనరించుచున్నారు. మనకు శుష్క వాక్యమును పలుకుటయందుగల అభిలాష సరైనరీతి నాటక కళ నభివృద్ధి నొందించుటయందు లేదనియే నిర్ణయింపవలసి వచ్చినదని గట్టిగా నమ్ముచున్నానుగాని యిదిపొరపాటని యెవరైన చెప్పగలిగినచో నా అభిప్రాయమును మార్చుకొందును. మన సంఘాభివృద్ధికి నాటక రంగమును, నాటకకళయును ముఖ్యతమములను దృఢ విశ్వాసము కలవారు మిక్కిలి కొద్దిమందియే యుందురు.

ఈ సభ కధ్యక్షత వహింపవలెనని మొదట నన్ను కోరినపుడు నాకది అయిష్టముగానే యుండెను. మొత్తముమీద సభలనిన నాకొక విధమగు ప్రతికూల భావమే సహజముగా కలదు. నేను వృత్తివలన న్యాయవాదిని. మీరందరూ న్యాయస్థానములో నొకదావాలో వాయిదా వేయబడవలెనని యొక న్యాయవాదిని కోరదలచినపుడు యీ వివాదము మధ్యవర్తులద్వారా పరిష్కరించుకొనుటకు ప్రతివాదు లంగీకరించిరని కోర్టులో తెలుపుట వాడుకయైయున్నది. ఆ మధ్యవర్తుల పరిష్కారము వలన ఎట్టిలాభము కలగదని ఎరిగియుండియే న్యాయవాదులిట్లు కోరు చుందురు, అట్టిసభలలో కొందరు స్వోత్కర్షను వెల్లడించుట కవకాశము లభించుచుండును. లేని సుగుణములను ఆధిక్యమును తమకున్నటుల లోకమును భ్రమింపచేయ గోరుట మానవ స్వభావము. అందువలన ఇట్టి సభలలో ఎవరో కొందరు తమ చొక్కాలకు గౌరవోద్యోగ చిహ్నములను తగిలించుకొని నిజముగా చేయునట్టిపని యేదియులేక పోయినను దుర్భరకార్య మగ్నులైనట్లు నటించుచు ఇటుఅటు కలయ దిరుగుచుందురు, ఎటులైననేమి మన నాయకుడైన దేశోద్ధారకునిఆజ్ఞకు బద్ధుడనై యీ సభకధ్యక్షత వహించుటకు సమ్మతించితిని. అందువలన నిపుడు మీ సమక్షములో బద్ధాంజలినై నిలచియున్నాడను. ఇపుడు వున్నదున్నట్లు చెప్పుటకే నేను ప్రయత్నించెదను. కాని యీరోజులలో నిజముచెప్పిన నిష్ఠూర మధికమగును. ఒక గడ్డిపోచను చూపించి ''యిదిగడ్డిపోచ'' అనిచెప్పినచో ''నేను మనోజ్ఞమగు కుసుమబాణుని పంచబాణములలో ఒక బాణమునుగాని గడ్డిపోచను కానని'' ఆ కొరగాని గడ్డిపోచగూడా లేచి నిష్కర్షగా ప్రత్యుత్తరమిచ్చుటకు వెనుదీయదు, నేనిపుడు తెలుపబోవు విషయములలో ఏవైనా కొన్ని నిరాధారములని మీకు తోచినచో మీరు నన్ను క్షమింప గోరెదను. ఒక వ్యాధిని కుదుర్చవలెనన్న ముందుగా దాని లక్షణములను బాగుగా తెలుసుకొన వలెను. అటులనే నాటక కళయందుగాని, నాటకరంగములందును

నిజమైన అభివృద్ధిని కలిగింపవలెననినపుడు వాటిలో నేర్పడిన లోపములను సరిగా తెలుసుకొనవలెను గాన, నేనిపుడు నిష్కపటముగా ప్రయత్నించెదను. ఇచట సమావేశమైన పండితులకందరికీ ముందుగానే నేనొక క్షమాపణను తెలుపుకున్నాను. "మన ప్రాచీనులు సర్వజ్ఞులు. వారు కనుగొనినదానికిపుడు క్రొత్తగా చేర్చబడవలసిన దేదియులేదు" అని పండితులొక్క వాక్యములోనే తెలిపెదరు. గానీ నేనీ విషయమున ప్రతికూలుడను. మన ప్రాచీనులు సర్వజ్ఞులైనచో మనము వారిసంతతి వారమైనపుడు మనము వారికంటెను ఘనముకాగలమని నమ్మిననే మన జన్మ సార్థకమగును. మన జాతీయాభివృద్ధిలో నాటకరంగము, నాటక కళలు ప్రధానాంగములనియే నేను తలచుచున్నాను. అభివృద్ధికి పోరితము ముఖ్య సాధనము. అటుల సమరమును సలుపవలెనను భావమును, అందులకు తగిన శక్తియును మనకు కలిగినపుడే మనము కీర్తి శిఖర పరంపరల నధిరోహింపగలము. మనము పోరాడవలసినది పరిస్థితులతోకాని మనుష్యులతోకాదు. మనము పౌరుషశక్తిని సరిగా గ్రహింపగల్గుటకు మనకీ సంగ్రామమున సంపూర్ణవిజయము లభింపవలెను. అదిసులభముగా లభించినచో చిరస్థాయియగు ఫలితము కలుగదు కాన మనయందుగల ప్రేమచే సర్వేశ్వరుడు మనకు సులభ సాధ్యములుగాని పరిస్థితులనే కలుగజేయుచుండును. అపుడే మనము మనయందుగల దివ్యమానవత్వమునుకూడా తెలిసికొందుము. కావున పురుష పుంగవులు పరిస్థితులను లోబరచుకొనుటకు సర్వశక్తులను వినియోగించుదురు. అట్టి మానవోత్తములొనర్చిన ఘనకార్యముల వలననే సంఘాభివద్ధి కలుగుచుండును. మనమెల్లప్పుడును రణరంగము లందే యుందుము. లేదా మనమటుల భావింపవలెను. కావున నిటుపైన కళావైభవమునకు ఆధారభూతులుగ నుండదగిన యువజనులు నాటక రంగములందు ప్రవేశించి యశోభాసురులు కావలెనని నేను వారిని కోరుచున్నాను. అందులకు వారికి నిరోధకములుగనున్న కట్టుబాటులను

మనోదౌర్బల్యములను లోబరచుకొనుటకు వారు తీవ్రమగు పోరు సలపవలెను. "గ్రీసుదేశీయులు అతిశయోక్తిలేని సౌందర్యారాధకులు. వారు పౌరుషమును కోల్పోకుండ వివేకమును ప్రేమించుదురు" అని వెనుక నొక గ్రీకుకవి వ్రాసిన వాక్యము లిటీవలనే బాల్డ్వినుగారుదాహరించిరి. ప్రాచీన భారత నాగరకతకుగూడా నిదియే ముఖ్యతత్త్వము. మనము సమరతలమునందున్నాము గాన సకల భోగములను త్యజింపవలెను. మనము విపరీతాభిప్రాయముల నన్నిటిని విడనాడవలెను. స్కంధావారమున నున్నవారినందరినీ సోదరభావముతోనే చూడవలెను. అపుడేమనము ప్రాచీన భారత నాట్యకళా వైభవమును గ్రహించుటకు నిశ్చలముగ పురోగమనమును సలపగలుగుదుము. భిన్నత్వమునందు ఏకత్వమును వెల్లడించునట్టిదియును, మాయాస్వరూపమును వెలిబుచ్చునదియును ప్రపంచ వ్యవహారములలో నేకభావమును కలిగింపగలదియును నాటక కళయేనని నేను గురుముఖమున వినియుంటిని. ఇది ఆత్మప్రకాశము బోధించును. ఆత్మప్రకాశమును ఆత్మవ్యాప్తిక్రింద పరిణమింపచేయును. చివరకు జీవాత్మ ప్రత్యేకతను పూర్తిగా హత మొనరించి పరమాత్మయగు శ్రీ కృష్ణునియందు జీవాత్మ లయ మొందునట్లు చేయును. శ్రీ కృష్ణుని దివ్య మురళీగానమున నవ్వాత్మ మిళితమగునట్లు సర్వసమ్మేళనమును కలిగించును. అంతరంగ, బహిరంగ సౌందర్యమును పెంపొందించుటకుగాను అంతర్గత బహిర్గత శక్తులను సమగ్రస్థితిలో నుంచుటకు లలితకళలు తోడ్పడును. మతము గూడా నొక కళయే.

మానవులు తమలో నణగియున్న నిర్మాణశక్తులను అనుభవమునకు తెచ్చుకొనుటకు, ఉపయుక్తములను సుందరములుగను, సుందరములను ఉపయుక్తములుగను మార్చగలుగుటను మతమువారికి బోధించును. మానవ స్వభావమునందు అణగియున్న భావములన్నియును బహిర్గతములగుట కొనరింపబడిన గొప్ప ప్రయత్నమేకళ.

కష్టానుభవమువలన పునీతములై సక్రమముగను, నియమ బద్ధముగను, చివరకు శ్రీకృష్ణుని మురళీగాన సుస్వరములను గ్రహింప వలెనను నాళలో నీ భావములు జీవాత్మ సంబంధమగు భారము నంతను బహిర్గత మొనరించుచుండును.

ప్రేమను బడయగలుగు నిమిత్తము హృదయము నందుగల మలిన పదార్థమునంతయు తొలచివేసి దానిని సమగ్రముగా చేయుట కొనరింపబడిన ఉలిపోటేకళ. హృదయమునందు గల నల్లమచ్చల నన్నిటిని తుడిచివేసి ప్రేమదేవతారాధనకు అర్హమగునట్లు దానిని పవిత్ర మొనరించునట్టి కుంచెయేకళ. హృదయమును మాటలతోగాక ప్రేమతో ప్రపూర్ణము నొందించునట్టి లేఖినియేకళ. మధురతమమగు దివ్యగానమునువిని తదనుగుణముగ నాట్యమొనరింపగల శక్తిని హృదయము బడయగలుగునట్టి దైవశక్తిని హృదయమునకు కలుగజేయు ఉపకరణమే కళ. ఇదియే కళలనుగూర్చి మన ప్రాచీనుల భావము. సంతాపకరమగు ప్రేమోదంతమును మరచిపోవుటకే యొకడు చిత్ర లేఖనమును ప్రారంభించెనని నేనెచటనో చదివితిని. అతడు ఉచితజ్ఞుడు. భౌతికపరమగు ప్రేమతో తన హృదయమును నింపుటకతడు మొదట ప్రయత్నించి విఫలుడయ్యెను. అంతట తన హృదయమును పరతత్వ పరమగు ప్రేమతో నతడు నింపబూనెను, కాలక్రమమున అతడు చిత్రలేఖకులలో అగ్రగణ్యుడయ్యెననియే నేను నమ్మెదను.

మీరు షిరాజు కథ వినియే వుందురు. అంధుడగు నతనికి, సౌందర్యమును సందర్శించి దానినిమనోహరాకృతితో వెల్లడింపగలశక్తి, ప్రేమవలననే కలిగినది.

హృదయవ్యథను మాన్పగలిగినది కళయొక్కటే. ప్రాచీన భారతమున కళాస్వరూప పరిజ్ఞాన మిటులేయుండెను. అభివృద్ధముగను.

సమగ్రముగను చేయబడిన నాటకకళా వైభవము ఒక జాతియొక్క విజ్ఞానమును వెల్లడించుననుు విషయమున మీరునాతో ఏకీభవించెదరనియే నేను నమ్మెదను. అదియే నిజమైనచో ప్రస్తుతము మనజాతియొక్క స్థితి ఎటులున్నది?

నవీన విజ్ఞానము జన్మవలన అస్పృశ్యత నెలకొల్పినది. మన నాటక కళాభివృద్ధి దారిద్ర్యమగు అల్పశక్తిని కలుగజేసినది.

నిజమగు నాటక కళయొక్క శక్తి అజేయము. నిర్మాణ శక్తి దారిద్ర్యమునకు, అల్పశక్తికి ప్రత్యర్థి. అట్టిచో మనకళలును, విజ్ఞానమును ప్రవర్ధితములగుచున్నవని మనము చెప్పగలమా? స్వాతంత్ర్యసిద్ధివలననే అభివృద్ధి కలుగును. పరాధీన దాస్యప్రవృత్తి గమనము నరికట్టిన మనుష్యుని యందుగల ప్రవర్ధక శక్తిని దుర్బలముగజేసి నిరోధించి దానిని పరాధీనస్థితికి పాల్పరుచునట్టి దుష్ట వికారగ్రహములు రెండు కలవు.

ఇప్పటి రోజులలో విశ్వవిద్యాలయ పట్టములను బడయుట పరిహాసాస్పదము. భౌతిక ప్రయోజనకరమగు దశలోగాని, అప్రయోజనకరమగు కళలోగాని విద్యార్థిఅర్హతను బడసెనని ఈపట్టము ధృవరచుటలేదు. బాధ్యతలను నెరవేర్చుటకు వెనుదీయుట, హక్కులను కోరుటకు మాత్రము ముందంజవేయుట—మనకు సూచనయై యున్నది. తమవలన ప్రతిఫలము నపేక్షించకుండ టికెట్లనుచితముగ నియ్యవలెనని నిర్బంధించుటకూడా నొక వ్యాధియే. ప్రస్తుతం దాక్షిణాత్య నాటకరంగమున రెండు విధములగు నిరంకుశత్వము కలదు. ఒకటి ఉచితముగా టిక్కెట్లను బడయుట. రెండవది ఔపకారిక ప్రదర్శనలు. ఈ రెంటికినిగూడా విలక్షణమగు వైజ్ఞానిక ప్రయోజనము కలదు.

విద్యావ్యాపనమునందు నాటకరంగము ప్రధానాంగమగుటయే కాక—ఒక సత్ప్రవర్తనను పెంపొందించుటకుకూడా నాటక రంగము అధికముగా తోడ్పడగలదు. ఇదిఒక నిర్మాణశక్తికి పరిశోధనాలయము. మనము మన మనస్తత్వమును పూర్తిగా పరిశోధింపవలెను. ఒకడు తానే సృష్టికర్త కాగలడన్న ప్రయోజనమును గ్రహించుటయే నాటకకళ యొక్క ముఖ్య ప్రయోజనము. తన ఆత్మస్వరూపమును తాను తెలిసికొని యితరులుకూడా తమ ఆత్మ స్వరూపముల నటుల తెలుసు కొనగలుగుటకే సార్థకనాముడగు నటుడురంగస్థలము నుపయోగించును గాన రంగస్థలము పవిత్రమగు ధ్యానభూమి. అతడచట స్వార్థపరిత్యాగ మొనరించి సంకుచితుడై పరులపై ప్రేమతో విస్తృతుడగును. సామాన్య ధ్యానమునకు నిర్జనస్థలము, ధౌతవస్త్రధారణము మున్నగునవి అవసరము. నటుని ధ్యానమునకు రంగస్థలమున సమస్త దేవతా సహాయమును అవసరము. ఈ ధ్యానమతనికి మాత్రమే సంబంధించినది కాదు. అదియొక సమిష్టి కుటుంబిక ధ్యానము లేక సార్వజనిక ధ్యానము. ఈ ధ్యానమున నటుడును ప్రేక్షకులనుగూడ చేరియుందురు. ఒక సముదాయమున ధనికులు, పేదలు, నీచులు, విద్యాధికులు, విద్యా విహీనులు, జ్ఞానధనులు, అజ్ఞానులు మొదలగువారందరూ వుందురు. ధ్యాన ప్రదేశమువలె నాటకరంగముకూడా యేకాగ్రతకు తోడ్పడుటకు మిక్కిలి శుచిగా వుండవలెను. పరిసరములన్నీ ధ్యానవస్తువునకు సంబంధించిన చిత్తరువులతోకూడి యుండవలెను. ప్రారంభమున లోహ నిర్మితమగు మృగమునెదుట నుంచుకొని యొకడు శ్రీకృష్ణునిపై చిత్తము నిలుపజాలడు. మదరాసు బీచి వీధిలోనున్న బర్మాఆయిల్ టాంకుగల జవనిక ఎదుట నుండగా సౌందర్యసదనమగు ద్వారకను గూర్చి ధ్యానింపగోరుట వారి కాఠిన్యమేఅగును. జనరలు పోష్టాఫీసు వద్దనుండు ఎర్రరంగు పూయబడిన టపాపెట్టెను శకుంతల క్రీడా రంగముతో చేర్చుటవలన మనశ్శాంతికి భంగము కలుగకమానదు.

నాటకకళను మహోన్నతికి కొనిరావలెనని మన జాతీయాభి వృద్ధిలో ఒక ముఖ్యాంగముగా మనము దానిని అంగీకరింపవలెను. నేనిదివరకు తెలిపినరీతిని కొంత నిర్మాణ కార్యక్రమముకూడా

అవసరమేఅగును.ఇంతవరకు నటులకును, ప్రేక్షకులకును అనుకూలము లగుగృహములను మనము నిర్మింపగలిగి యుండలేదు. వేషధారణమున నెట్టి ప్రావీణ్యమును బడయలేదు. రాజవేషములనన్నిటిని బండితోలువారి పద్ధతినే మనము స్థిరపరచుచుందుము. ఈ నాటక రంగపు రాజులకు వేష్టనములును, పాదరక్షలును ఎటనుండి లభించునో తెలిసికొనుట చాల ఆశ్చర్యకరముగనే వున్నది. నాటకరంగమునందలి రాజునుచూచినపుడెల్ల మండలములలో దొరతనమువారు నిర్మించునట్టి తాలూకాకచేరీల పద్ధతి గృహ నిర్మాణము నాకు జ్ఞాపకమునకు వచ్చుచుండును. నాటకము లలో పాత్రధారులకు కృత్రిమ శిరోజముల నమర్చుపద్ధతి మరింత అసహ్యాకరముగా నున్నది. నాటక ప్రదర్శనముల నేర్పాటుచేయువారు అగ్రభాగము నందలి ఆసనములలో కూర్చుండువారికి అసౌకర్యములను మాత్రమే గమనించెదరుగాన వెనుకప్రక్క కూర్చుండువారికి నటుల ముఖవైఖరులలో కలుగు మార్పులేమియు గోచరించవు. ప్రేక్షకులు యావన్మందియు ప్రతి నటుని ముఖవైఖరిలోను కలుగు అతి సూక్ష్మములగు మార్పులనుకూడా సమానముగా చూచుటకు వీలగునటుల నిర్మింపబడిన నాటకశాల నిప్పటివరకు నేనెచటనూ చూచియుండిలేదు.

ఇప్పుడు నాటకరంగములందు పాడబడుచున్న సంగీతం శిరో వేదనము కలిగించుటకు మాత్రమే. నాటకములో సంగీతముండగూడదని నేను చెప్పుటలేదు. సంగీతముతోకూడిన నాటకములను మనము ప్రదర్శించి అందువలన మనము ప్రేక్షకుల కానందము గల్గింప గలుగుదుము. కావున నిపుడు రంగస్థలములో మనము వినుచున్న సంగీతము నాటకముల కెంతమాత్రము పనికిరాదు. ఇపుడు ప్రేక్షకులు కూడాపూర్తిగా సంగీతవ్యామోహమునకు దాసులగుటచే మననాటకములు పాటకచేరీలుగను, హరికథా కాలక్షేపములుగను మారిపోయినవి. ప్రదర్శింపబడవలసిన నాటకము సంగతి ప్రేక్షకుడు పూర్తిగా మరచి పోయి, నటులు రంగస్థలమున కూర్చుండి తాముకోరినపాటల నన్నిటిని

పాడవలెనని నిర్బంధించునట్టి దుస్థితిగూడ తటస్థించినది. ఇంతకంటె అవమానకరమగు విషయము మరేదియు నుండదు. ఆంధ్రనాటకరంగ మింతటి నీచస్థితికి రాగలదని నేనెన్నడును తలంచియుండలేదు. ఆంధ్ర నాటకములు అధమాధమములగు యక్షగానములస్థితికి వచ్చినవి. దీనికి గల కారణమందరికినీ తెలిసినదే. ఇదివరకు ఈ పరిషత్తువారు రెండు వార్షిక సభలను జరిపిరి. ఇదిమూడవది. ఆంధ్ర నాటక రంగమునకు సంప్రాప్తమైన ఈ దుస్థితిని తొలగించుటకు మీరేమిచేసితిరని విజ్ఞాన ధనులగు మిమ్ములను నేనడుగుచున్నాను. ఇందులకు మీరేబాధ్యులు. విద్యాధికులారా! యువజనులారా! విద్యార్థులారా! ఆంధ్రుల ఉదారమగు నాట్యకళను హతమొనరించుచున్న ఈ క్రూరపిశాచమును మారణ హోమము గావించుటయను ఘనతరమగు కార్యభారము మీరు వహింపవలెను. యువకులలో గ్రంథకర్తలును కవులును నడుముకట్టి మన కళాప్రకాశమును మందీకృత మొనరించుచున్న మూఢవిశ్వాసము లను సాంప్రదాయములను తుడిచివేయవలెను. విశ్వామిత్రుడు నూతన సృష్టి చేయగలుగుటకు సహాయభూతమైన నిర్భయత్వమను రసాయ నమును తనివిదీర మీరాస్వాదింపవలెను.

తనతోపాటు జనకమును గూడ సురపురికి కొనిపోవలెనని దేవేంద్రుని నిర్బంధించిన యుధిష్ఠిరునకు కలిగిన జీవకారుణ్యమును మీరలవరచుకొనవలెను. ఇట్టి జీవకారుణ్యమే ఆధునికులలో తుకారాం తన చెంతనున్న రొట్టెముక్కను హరించిన కుక్కకు ఘృతముకూడా నొసంగునట్లు చేసినది. నూరుమంది భార్యలుండినను చాలక నూట ఒకటవ భార్యను పెండ్లియాడ గోరునట్టి పురుషాధములను తమ నాటక ములో నాయకులుగా చేయునట్టి నాటకకర్తలను నాకుకావలెను. కణ్వాశ్రమమున నమ్మించి పెండ్లాడి మరచిపోయిన దుష్యంతునివంటి భర్తలను పాదప్రహారములచే బహూకరించు శకుంతలను, వితంతు శరణాలయములను సమర్థించునట్టి సావిత్రులును, నాయికలగా నొనరించు కవులు నాకు కావలెను. ప్రాచీనకాలమునందువలె మరలా నాటక రంగమును విద్యా రంగముగా చేయగల కవులు

కావలెను. మానవునకు - మానవునకు, మానవునకు - సృష్టికర్తకుగల సంబంధమును బాగుగా బోధింపగల విద్యాలయముగ రంగస్థలమును మార్చునట్టి కవులు కావలెను జీవితమెటులున్నదియును ఎటులుండ వలసినదియును రంగస్థలమునందు స్పష్టపరుపబడవలెను. పౌరాణిక నాటకములను ప్రదర్శింపదగినకాలము గడచినది. సుబ్రమణ్యమునకు పెండ్లియైననేమి కాకపోయిననేమి? సత్యభామకు రుక్మిణిపై సవతి మచ్చరముండిననేమి? లేకపోయిననేమి? ప్రజల నిత్యజీవనమునకు సంబంధించిన విషయములను ప్రదర్శించుటవసరమును, ప్రయోజన కరమును నగునుగాని పట్టపురాణిగాథల ప్రదర్శించుట నిరుపయోగము. మన నిత్య జీవనమునకు సంబంధించిన సమస్యలు వేలకొలదిగానున్నవి. మనము కనివిని యెరుగని విషయములను ప్రదర్శించుటమాని మన మనుక్షణము కనుచు వినుచుండు విషయములనే ప్రదర్శించుచుండవలెను. మన ప్రాచీన జ్ఞానమును, జాతీయ ధీరశక్తిని, విశ్వమానవ జీవితమునకు సంబంధించిన సమస్యలను గ్రహించి పరిష్కరింపబూనిన కార్య నిరతిని నాటకములు వెల్లడింపగలిగి యుండవలెను. వ్యక్తి జీవనమునందుగల ప్రజల శక్తులను వెల్లడించుచుండవలెను. శ్రీరామచంద్రుడు తనభార్యను హరించిన రాక్షసుని హతమొనరించెనని మనముభావించుట కంటే అతడు తన దేశమందలి ప్రజలమేలుగోరి పరిపాలనకు సంబంధించిన సమస్యలను పరిష్కరించిన రీతినిగూర్చి మనము భావించుట వలననే అధికమగు ప్రయోజనము కలుగగలదు. మానవోత్తముల జీవితమే సామాన్య ప్రజలకు మతమగుచున్నదని తెలుపబడవలెను. మనుష్యుడు కార్యసిద్ధిని విజయమును సమగ్రతను బడయుటకు చేయునట్టి ప్రయత్నములలో, మొదటకలుగునట్టి సంఘర్షణములు, పరాజయములు మున్నగువాటి నెదుర్కొనుటకతడు చూపిన పట్టుదలను పరికించుటయే మిక్కిలిఆకర్షణీయముగా నుండగలదని నేనుతలచుచున్నాను. మనుష్యుని యందుగల దైవత్వము ప్రకటించుటయే విద్యయొక్క ముఖ్యప్రయోజనము. కళలవలనను ముఖ్యముగా నాటక ప్రదర్శనము వలనను ఆ ప్రయోజనము సిద్ధింపగలదు.

---

# నాట్యకళాప్రపూర్ణ
# రాఘవ అభినయించిన నాటకాలు - పాత్రలు

## తెలుగులో

| నాటకము : | రచయిత : | పాత్ర : |
|---|---|---|
| సునందిని | కోలాచలం శ్రీనివాసరావు | దుష్టబుద్ధి |
| చాంద్‌బీబి | ,, | ఉస్మాన్‌ఖాన్ |
| విజయనగరపతనము | ,, | పఠాన్ రుస్తుం |
| భారత యుద్ధము | ,, | దుర్యోధన |
| హరిశ్చంద్ర | ,, | హరిశ్చంద్ర |
| రామదాసు | ధర్మవరం గోపాలాచార్యులు | రామదాసు |
| సుభద్ర | ,, | అర్జున |
| సారంగధర | ధర్మవరం రామకృష్ణమాచార్యులు | సారంగధర |
| పాదుకాపట్టాభిషేకము | ,, | దశరథ |
| ప్రమీళార్జునీయం | ,, | అర్జున |
| సావిత్రి | ,, | యముడు |
| ప్రహ్లాద | ,, | హిరణ్యకశిపుడు |
| విరాటపర్వము | ,, | కీచకుడు |
| చిత్రనళీయము | ,, | నలుడు |
| పాంచాలీ స్వయంవరము | ,, | అర్జున |
| ప్రతాపరుద్రీయము | ,, | ప్రతాపరుద్రుడు |
| తప్పెవరిది | పి. వి. రాజమన్నార్ | భీమసేనరావు |
| సరిపడని సంగతులు | రాఘవ | శ్రీధరుడు |
| రాణాప్రతాపసింహ | ద్విజేంద్రలాల్‌రాయ్ | రక్తసింహుడు |
| దుర్గాదాసు | ,, | దురాదాస్ |

## కన్నడములో

| | | |
|---|---|---|
| రాణీసంయుక్త | కె. భీమరావు | పృథ్వీరాజు |
| సావిత్రిద్యుమత్సేన | ,, | యముడు |
| మండోదరి | సి. కె. వెంకటరామయ్య | రావణుడు |
| తాళికోట | మాస్తి వెంకటేశఅయ్యంగార్ | ఉస్మాన్ |
| పార్వతీపరిణయ | ,, | వృద్ధశివ |
| రాణాప్రతాప్ | ,, | శక్తసింహ |
| మోహనాస్త్ర | ,, | మోహన |
| కనకదాస | జోళదరాసి దొడ్డనగౌడ | మోహన |

| | | |
|---|---|---|
| మార్కండేయ | బెళ్ళావె నరహరిశాస్త్రి | వృద్ధబ్రాహ్మణ |
| ఇద్దద్దు ఇద్ధహాగె | కె. గురురాజరావు | ,, |
| మదువెయో - మనెహాళో | ఆ. న. కృష్ణరాయ | వృద్ధ శేషగిరిరావు |

### హిందీలో

| | | |
|---|---|---|
| దీనబంధు కబీర్ | పండిత తారానా ర్ | రామదాసు |
| ఇన్సాఫ్ | ,, | శ్రీధర్ |
| సమాజ్ | ,, | . . . |

### ఆంగ్లములో

| | | |
|---|---|---|
| Othello | Shakespeare | Othello |
| Hamlet | ,, | Hamlet |
| Macbeth | ,, | Macbeth |
| King Lear | ,, | King Lear |
| Romeo and Juliet | ,, | Romeo |
| Merchant of Venice | ,, | Shylock |
| Rivals | Sheridan | Captain Ablsolute |
| Chitra | Tagore | అర్జున |
| King's wife | J. H. Cousins | రాణాకుంభ |

### తమిళంలో

| | | |
|---|---|---|
| పారంగధర | | పారంగధర |
| నందనార్ | — | — నందనార్ |

## చలనచిత్రాలు

### తెలుగులో

| | | | |
|---|---|---|---|
| ద్రౌపదీమానసంరక్షణము | — | — | దుర్యోధన |
| రైతుబిడ్డ | — | — | వృద్ధరైతు |
| చండిక | — | — | మంత్రి |
| కన్యాశుల్కం | — | — | గిరీశం |
| ఆలోకంనుండి ఆహ్వానం | | | |
| తీరనికోరిక | | | |
| స్వార్థ త్యాగం | | | |

### కన్నడంలో

| | | | |
|---|---|---|---|
| మోహనాస్త్ర | — | — | మోహన |
| రుక్మాంగద | — | — | రుక్మాంగద |